ప్రథమ ముద్రణ :
సంక్రాంతి, 1990
ప్రచురణ :

నవభారతి ప్రచురణలు
3-4-705/4, నారాయణగూడా
హైదరాబాదు-500 029.

ప్రతులకు :
సాహిత్య నికేతన్
బరకత్‌పురా
హైదరాబాదు-500 027.

సాహిత్య నికేతన్
కాశీశ్వరరావు రోడ్
గవర్నరు పేట
విజయవాడ-520 002.

ముద్రణ :
పద్మావతీ ఆర్ట్ ప్రింటర్స్
హైదర్‌గూడ, హైదరాబాదు-500 029.

వెల : రూ. 5-00

# ప్రజాహితం లేని చైనా కమ్యూనిజం





రచన

స్వాతి



నవభారతి ప్రచురణలు
హైదరాబాదు - 27.

# ముందు మాట

టియాన్మిన్ కూడలిలో
ప్రవహించిన నెత్తురు
వెదజల్లిన సువాసనలను
తూర్పుఐరోపాదేశాలు
ఆఘ్రాణించాయి.
మరి చైనా సంగతీ !

మానవుడు స్వతహాగా ప్రజాస్వామ్య వాది. అది చాల విధాలుగా మంచిది. కాని మానవునిలో మూడో పురుషార్థం పట్ల వ్యామోహం ఎక్కువైనప్పుడు తోటి మానవునే అనేక రకాలుగా, అనేక పేర్లతో దోపిడీ చేస్తాడు ఆ దోపిడీకి మరో పేరు నియంతృత్వం. వ్యక్తి నియంతృత్వం సంగతి అలా ఉంచితే ముఠా నియంతృత్వం చాలా భయంకరమైంది. కమ్యూనిజం ప్రతిపాదించే శ్రామికవర్గ నియంతృత్వం, పార్టీ సిద్ధాంతాల మసిపూసి నియంతృత్వాన్ని మారేడు కాయను చేయటమే. అది కూడ చివరకి పార్టీ సెక్రటరీ నియంతృత్వమే - చౌసెస్కో ఉదాహరణ ఆ విషయాన్నే ఋజువు చేస్తోంది, తూర్పు ఐరోపా దేశాలలో వస్తున్న మార్పులను అందరం గ్రహించగలుగుతున్నాం. చైనాయే అర్థంకావటం లేదు.

శ్రీ 'స్వాతి'ని ఈ విషయంపై వివరణాత్మకంగా చిన్ని పుస్తకాన్ని వ్రాసి ఇవ్వమని అడుగగానే వారు ఈ పుస్తకాన్ని ముద్రణకై మాకిచ్చారు. వారికి మా కృతజ్ఞతా పూర్వక నమస్సులు.

శుక్లపుష్యకృష్ణ తదియ
మకరసంక్రాంతి
14, జనవరి 1990
హైదరాబాదు.

ప్రకాశకులు

పీడిత ప్రజానీకానికి ఆశాజ్యోతి కమ్యూనిజం అన్నారు. ఆ ఆశా జ్యోతి కాగడా కాగా ప్రజల్ని నిలువునా అంటించి దహించిన కథ నభూతో నభవిష్యతి అసంభవం అన్న అలాంటి చర్యను సంభవం చేసిన కీర్తి కమ్యూనిజానిదే!

అది జూన్, 3 1989 నాటి రాత్రి. చైనా రాజధాని పెకింగ్ నడిబొడ్డులోని టియానన్ మెన్ కూడలి. లక్షదాకా వున్న విద్యార్థి సమూహం. ప్రపంచం విరుచుకుపడిన కాళరాత్రి అది. ఆ ప్రఖ్యాత కూడలే వారి సమాధి స్థలం. లాఠీలు కాదు, సరాసరి టాంకులే దొర్లాయి వాళ్ళ మీదికి. నేరుగా జనంలోకి కాల్పులు జరిగాయి రక్తం ఏరులై పారింది. యువతీ యువకుల శరీరాలు ముక్కలై ఆ కూడలి అంతా పరుచుకున్నాయి. వికటాట్టహాసం చేసింది కమ్యూనిజం. పైశాచిక అట్టహాసం చేసింది మావోయిజం. ఎందరు మారణహోమం అయ్యారో ఎవరూ సరిగా అంచనా వెయ్యలేదు - వెయ్యలేరు. మూడువేల నుంచి పదివేలదాకా ఎంతమందైనా కావచ్చు.

బెల్టులతో కొట్టారు. లాఠీలు ఝళిపించారు. బాష్పవాయువు ప్రయోగించారు. రబ్బరు తూటాలు, నిజమైన తూటాలు ప్రయోగించారు. యువతీ యువకుల పట్టుదల చెదరలేదు.

చర్చలు లేవు, సంభాషణలులేవు. యుద్ధ టాంకులు, ఇతర సాయుధ వాహనాలు ఎనిమిది రహదారుల నుంచి ఆ చత్వరాన్ని చుట్టుముట్టాయి!

మొదట ప్రజా సైన్యం 38 వ బెటాలియన్‌కు ఆ పసివాళ్ళమీద కాల్పులు జరపమని ఆదేశాలివ్వటం జరిగింది. వాళ్ళాపని చెయ్యటానికి అంగీకరించలేదు. ఆ తర్వాత 27 వ దళం దిగింది, ఆ రెండు బెటాలియన్ల మధ్యా కాల్పులు కూడా జరిగిన తర్వాత టాంకులతో కాల్పులు మొదలయ్యాయి. శనివారం, జూన్ 3 రాత్రి పెద్దలు చేసిన నిర్ణయం అది.

1949, అక్టోబరు, 1 వ తేదీన మావోజీడాంగ్ సగర్వంగా 'చైనా జాతి నిలబడ్డది' అని విజయధ్వజాన్ని ఎగరేసిన విశాల మైదానం అది. 40 హెక్టేర్ల (వంద ఎకరాల) ఆ ఎనిమిది రోడ్ల కూడలి నుంచి మానవ కళేబరాలను, ఖండిత అంగాలను, మాంస ఖండాలను పారలతో (Show-els) ఎత్తేస్తుండటాన్ని చూచారు కొందరు విదేశీ యాత్రికులు. ముఖాలకు బట్టలు చుట్టుకున్న దళాలు ఆ 'యుద్ధ' బీభత్సాన్ని శుభ్రం చెయ్యటానికి, తుపాకి గుండ్లతో బొక్కలుపడ్డ గోడల్ని పూడ్చటానికి, రక్తపు మరకలు తుడిచెయ్యటానికి, వారాల తరబడి పనిచెయ్యాల్సి వచ్చింది!

ఎందుకు ఇంత బీభత్సం?

అంతర్యుద్ధమా??

కాదు! విద్యార్థులు, విద్యార్థినులు 'ప్రజాస్వామ్యం కావాలి' అని వారాల తరబడి ఆటియానన్‌మెన్ కూడలిలో శాంతియుత ప్రదర్శనలు చేస్తున్నారు. అందుకే టాంకులొచ్చాయి.

"అల్ప సంఖ్యాకుల ప్రోద్బలంతో జరిగిన గొడవ ఇది. వ్యక్తుల ఇష్టానికి వ్యతిరేకంగాజరిగిన అలజడి" అన్నాడు చైనా సర్వాధికారి డెంగ్ గియావోపింగ్.

కమ్యూనిజపు నిరంకుశత్వంతో విసిగిన చైనా సమాజం చేసిన ఆ బృహత్కర ఆందోళన ఇష్టంలేనివా? 7 వారాలు సాగిన శాంతియుత ప్రదర్శన ఏదో కొద్దిమంది వల్ల జరిగిన ప్రోద్బల ఫలితమా!

1960 ల్లో సాంస్కృతిక విప్లవపు హత్యాకాండ ఉధృతంగా సాగే రోజుల్లో "ఆకాశం కింద చాలా పెద్ద గందరగోళం జరుగుతోంది. పరిస్థితి అద్భుతంగా వుంది" అన్న మావో వారసుల నిర్ణయం అది.

ప్రజా స్వామ్యంకోసం అంత పెద్ద ప్రదర్శన చేసే అవసరం ఏమొచ్చింది?

ప్రజలకోసం ఏర్పడ్డ కమ్యూనిజాన్ని లక్షలమంది చైనా యువత ఎందుకు వద్దంటోంది?

ప్రజల్లో కలిసిపోయి, జనత అభ్యుదయంకోసం శ్రమిస్తోందన్న చైనా కమ్యూనిస్టు ప్రభుత్వం ఎందుకు తిరస్కరించబడుతోంది?

ఈ ప్రశ్నలకు జవాబు వెతుక్కుంటూ చైనా చరిత్రలోకి వెళ్దాం.

## 1. ఇజాల కథ

'కమ్యూనిజం అంటే ఏమిటి?'

'మార్క్సిజం, లెనినిజం, మావోయిజం, ఇలా ఇన్ని ఇజాలెందు కేర్పడ్డాయి? వీటికి కమ్యూనిజానికి తేడా ఏమిటి?

చైనా కమ్యూనిజానికి, రష్యా కమ్యూనిజానికి తేడా ఏమిటి? సోషలిజం అంటే ఏమిటి?

ఒకే ఆదర్శం అయిన కమ్యూనిజానికి అంకితమైన రష్యా, చైనాలు ఒకే తాటిమీద ఎందుకు నడవ్వు?

కమ్యూనిజపు నిరంకుశత్వంతో విసిగిన చైనా సమాజం చేసిన ఆ బృహత్కర ఆందోళన ఇష్టంలేనివా? 7 వారాలు సాగిన శాంతియుత ప్రదర్శన ఏదో కొద్దిమంది వల్ల జరిగిన ప్రోద్బల ఫలితమా!

1960 ల్లో సాంస్కృతిక విప్లవపు హత్యాకాండ ఉధృతంగా సాగే రోజుల్లో "ఆకాశం కింద చాలా పెద్ద గందరగోళం జరుగుతోంది. పరిస్థితి అద్భుతంగా వుంది" అన్న మావో వారసుల నిర్ణయం అది.

ప్రజా స్వామ్యంకోసం అంత పెద్ద ప్రదర్శన చేసే అవసరం ఏమొచ్చింది?

ప్రజలకోసం ఏర్పడ్డ కమ్యూనిజాన్ని లక్షలమంది చైనా యువత ఎందుకు వద్దంటోంది?

ప్రజల్లో కలిసిపోయి, జనత అభ్యుదయంకోసం శ్రమిస్తోందన్న చైనా కమ్యూనిస్టు ప్రభుత్వం ఎందుకు తిరస్కరించబడుతోంది?

ఈ ప్రశ్నలకు జవాబు వెతుక్కుంటూ చైనా చరిత్రలోకి వెళ్దాం.

# 1. ఇజాల కథ

'కమ్యూనిజం అంటే ఏమిటి?'

'మార్క్సిజం, లెనినిజం, మావోయిజం, ఇలా ఇన్ని ఇజాలెందుకేర్పడ్డాయి? వీటికి కమ్యూనిజానికి తేడా ఏమిటి?

చైనా కమ్యూనిజానికి, రష్యా కమ్యూనిజానికి తేడా ఏమిటి? సోషలిజం అంటే ఏమిటి?

ఒకే ఆదర్శం అయిన కమ్యూనిజానికి అంకితమైన రష్యా, చైనాలు ఒకే తాటిమీద ఎందుకు నడవ్వు?

'సమాజం కుళ్ళిపోతుంది. ఆ సామాజిక జీవితంలోనే, ఆ రోగగ్రస్థ సమాజాన్ని ఎదుర్కొనేవాళ్ళు పుట్టుకొస్తారు'— ఇది మార్క్స్టీక.

మార్క్స్ ప్రతిపాదించిన సిద్ధాంతానికి 'గతితార్కిక భౌతిక వాదం' అని పేరు.

మార్క్స్ అభిప్రాయం ప్రకారం మానవ చరిత్ర యావత్తూ ఆరు విభాగాలు. ఆదిమ యుగంలో మానవులు సామ్రాజ్యవాద సంఘాలల్లో నివసిస్తూండేవారు. ఉత్పత్తి, పంపిణీలూ సమాజవాద పద్ధతుల్లో జరిగేవి. తర్వాత బానిసయుగం వచ్చింది. వ్యక్తిగత ఆస్తులు ఏర్పడ్డాయి. తర్వాత రాజ్య వ్యవస్థ, ఆ తర్వాత ఫ్యూడల్ వ్యవస్థ. ఇందులో పేద రైతులు జమీందార్ల అధీనంలో వుండేవారు. వాళ్ళు అర్ధ బానిసలు. అటు తర్వాత పరిశ్రమలు, ఫ్యాక్టరీలు వచ్చాయి. పెట్టుబడిదారీ వ్యవస్థ వచ్చింది. ఈ బూర్జువా వ్యవస్థలో కష్టించేది కార్మికులు, లాభం పొందేది పెట్టుబడిదార్లు. ఇహ కార్మిక (శ్రామిక) నియంతృత్వం పుడుతుంది. దాంతో సమాజంలో సంపద, రాజ్య వ్యవస్థ శ్రామికులకు అందుతాయి. పరపీడన లేని సమాజ వాద యుగం ఇది. ఆ తర్వాతది రాజ్య విహీన సమాజ జీవనం. మానవ జాతి స్వర్ణ యుగం.

మార్క్స్ సిద్ధాంతం ప్రకారం మానవజాతి చరిత్ర అంతా వర్గ పోరాటాల చరిత్ర. దీనికే పెడర్థాలు తీసి మన కమ్యూనిస్టులు సంఘటిత సమాజాన్ని వర్గాలుగా చీల్చి పోరాటాలు లేవదీస్తున్నారు. సమాజంలోని ధర్మాధర్మ పోరాటాలు, తత్ఫలితంగా ఏర్పడ్డ మార్పులు మార్క్స్కు చర్చనీయాంశం.

మార్క్స్ భౌతిక సిద్ధాంతం 18వ శతాబ్దంలోని పారిశ్రామిక భౌతికతత్వం, స్వేచ్ఛా భౌతికవాదాల్ల సున్నిత మిశ్రమం.

'మానవుడు పరిసరాలకు బానిస. అతను తన జీవనరీతిలోనే గాక ఆలోచనల్లో కూడా బందీయే. భౌతికవాదం మానవాళి వ్యవహారాల నిజ స్వరూపాన్ని బయటపెట్టేదే గాదు. మానవుడ్ని బందీగా చేసిన మతాలు, మిథ్యలు, మూఢనమ్మకాలు వీటన్నింటినీ అంతంచేసే మంత్రం'.

మార్క్స్ ఆర్థిక సిద్ధాంతాలు మూడు ముఖ్యమైన ఆలోచనల మీద ఆధారపడివున్నాయి.

1. రాజకీయ ఆర్థికశాస్త్రం సమాజంలో సంపద పంపిణీకి సంబంధించింది. ఎవరికి ఏది అందాలి ఎందుకు అందాలి? అన్న విషయాలు సకారణంగా కనుక్కోబడాలి.

2. కర్మాగారాలు, పరిశ్రమలు నిర్మించటం, పెంచటం ఆధునిక ఆర్థిక పురోగమనానికి నాందీప్రస్తావనలు. మనిషికి, భౌతిక శక్తులకు మధ్య వున్న సంబంధాలను పునర్వ్యవస్థీకరించేదానికి దారి తీస్తుంది పారిశ్రామిక యుగం.

3. ఇంగ్లాండులో 19వ శతాబ్దపు తొలిరోజుల్లో ఏర్పడ్డ ఆర్థిక పురోగమనం ప్రపంచంలో అన్ని చోట్లా పెంపొందనున్న ఆర్థిక స్థితిగతులకు సూచన. భిన్న వర్గాల ఆర్థిక స్వభావాలు ఎలా రూపొందుతాయో తెలుసుకోవటానికి ఇక్కడి మార్పులు తార్కాణం.

19వ శతాబ్దంలోని ఇంగ్లాండు మార్క్స్ పరిశోధనాలయం.

మానవుల శ్రమ వర్తకపు సరుకయింది. 'మనిషి 4 గంటల శ్రమతో వచ్చేదాంతో తన అవసరాలను తీర్చుకోగల డనుకుందాం. కాని పెట్టుబడిదారీ వ్యవస్థ అధిక ఉత్పత్తి కోసం అతనిచేత ఇంకా ఎక్కువ సేపు పనిచేయిస్తుంది. ఇదే పీడన (exploitation), దోపిడీ' అంటాడు మార్క్స్.

మార్క్సిజం సామాన్య మానవులకు ఏర్పరిచిన అతి సున్నితమైన సిద్ధాంతం. స్వేచ్ఛా స్వాతంత్ర్యాలను తెచ్చిపెట్టే సిద్ధాంతంగా చెప్పబడ్డది. ఆ తర్వాత లెనిన్, స్టాలిన్, మావోల చేతుల్లో నలిగి ఎలా అయిందో అన్నది వేరే సంగతి.

తొలి రోజుల్లోని మార్క్సిస్టులు తమ సిద్ధాంతం పారిశ్రామికంగా అభివృద్ధి చెందిన ధనిక దేశాల్లో విజయాన్ని సాధిస్తుందని ఆశించారు. కాని మార్క్సిజం వెనకబడ్డ దేశాల్లో విజయం పొందింది! పారిశ్రామికంగా అభివృద్ధి చెందని దేశాల్లో రాజ్యాన్ని చేజిక్కించుకుంది.

మార్క్స్ కలలుగన్న రాజ్యవిహీన స్థితిలో కమ్యూనిస్టు వ్యవస్థ మానవ జీవితాన్ని తీర్చిదిద్దుతుందనే మిథ్య మీద నమ్మకం పెంచుకున్న వాళ్లు తమనుతాము కమ్యూనిస్టులం అని పిల్చుకున్నారు.

ఏ రాజకీయ పార్టీ అయినా తన సభ్యులకు ఎన్నో ఆకర్షణల్ని చూపుతుంది. కమ్యూనిజం తనవైపు మొగ్గినవారికి ఏదీ ఇవ్వలేదు. పైగా త్యాగాల్నే కోరింది. భౌతిక సుఖాల్ని వదులుకోమంది. తమకున్నదంతా అందించి ఆత్మ సమర్పణకు తయారు కమ్మంది. అయినా జనం సిద్ధమయ్యారు.

వామపక్ష వాదంలో జనానికి ఓ ధ్యేయం కనిపించింది. పీడిత మానవాళి ఉద్ధరణ గోచరించింది. ఆ యజ్ఞంలో సమిధలై కాలిపోవటంలో ఓ ఆత్మానందం తొణికిసలాడింది. ప్రపంచ విప్లవ మార్గం తమ ముందు స్వర్గసోపానంలా కనిపించింది.

అందువల్లనే కమ్యూనిజం అతిగా పీడించబడే రష్యా, చైనా ప్రజల్లో బడబాగ్నిలా వ్యాపించింది. ఎక్కడ ప్రజలు ఎక్కువపీడనకు గురయ్యారో అక్కడ కమ్యూనిజం మరింతగా పెరిగింది.

'అధికారం కళ్లెలు తమ చేతికి వచ్చేవరకూ కమ్యూనిస్టులు తాము విప్లవకారులమన్నారు. ఓసారి అధికారాన్ని చవిచూచాక దానికి దాసులై పోయారు. అధికారం వల్ల లభించే భోగవిలాసాలు అలానే తమకు కొన సాగాలని కోరుకున్నారు విప్లవ రథం ముందుకు సాగితే తమ ఆనందాలు ఏమవుతాయో అని దాన్ని వెనక్కిలాగారు. ఇలా నిన్నటి విప్లవయోధులు నేడు విప్లవనిరోధకులయ్యారు దీనికి పరిష్కారం ఆ వ్యవస్థను కూల దోసే మరో విప్లవాన్ని తీసుకరావటమే! ఇది అన్నది ఎవడో ఛాందసుడు కాదు. స్వయానా మావో. ఆ మావోయే సాంస్కృతిక విప్లవం పేరుతో తన ప్రత్యర్థుల్ని తొలగించి తన పదవిని సుస్థిరం చేసుకోవటానికి సాంస్కృతిక విప్లవాన్ని నడిపి రక్తపుటేరులు పారించాడు చైనాలో.

## లెనిన్-స్టాలిన్

వ్లాడిమిర్ ఇలైఇచ్ ఉల్యానోవ్ (లెనిన్ -1870-1924) మార్క్స్ పంథాలో నడుస్తూ తన పేరున లెనినిజాన్ని సృష్టించిన కమ్యూనిస్టు బోల్షివిక్‌ల సృష్టికర్త. రష్యా విప్లవ అధినేత. రష్యాలో సోషలిజం సాధన అతని జీవిత ధ్యేయంగా విప్లవకారుల్ని తయారు చేశాడు

పూర్వపు సామ్రాజ్యవాద ప్రభుత్వాన్ని కూలగొట్టి అలెగ్జాండర్ కెరెన్స్కీ ప్రజాస్వామ్య పద్ధతిలో ప్రభుత్వాన్ని ఏర్పరిచాడు రష్యాలో. కాని మొదటి ప్రపంచయుద్ధ నీతిలో భాగంగా జర్మన్లు లెనిన్‌ను తమ దేశం ద్వారా రష్యాకు పంపారు. ప్రపంచ యుద్ధంలో పోరాడే సైన్యాల్ని విరమింపజేస్తాడన్న ఆశతో లెనిన్‌కు సహాయంచేశారు. వాళ్ళ ఆశలు ఫలించాయి. అక్టోబరు, 1971లో బోల్షవిక్ విప్లవాన్ని నడిపి అధికారాన్ని హస్తగతం చేసుకున్నాడు లెనిన్ అయితే ప్రత్యర్థుల్ని, ప్రతిపక్షాన్ని తుడిచిపెట్టి నియంతగా మారాడు, గతితర్కం మట్టిగొట్టుకపోయింది.

1918 నుంచి 1920 వరకు అంతర్యుద్ధంలో మునిగింది రష్యా. ప్రజాస్వామ్యవాదులు, జాతీయవాదులు, సైనికనియంతలు అందరూ తుద ముట్టించబడ్డారు.

కమ్యూనిజానికి కొత్త అర్థాలు చెప్పాడు లెనిన్. దేశసంపదను జాతీయంచేశాడు. ఆంతర్జాతీయ కమ్యూనిజం (కోమింటర్న్) పేరుమీద విదేశాల్లో విప్లవాలు తెచ్చాడు. అతని కాలంలోనే ఆందోళన—ప్రచారం (Agir-Prop) సాధనాలుగా కమ్యూనిజంతో ప్రపంచాన్ని ఊదరగొట్టటం జరిగింది. 21-1-1924లో మూడోసారి గుండె పోటుతో మరణించాడు లెనిన్.

రష్యా అధికార పోరాటంలో విజయం సాధించిన స్టాలిన్ 1927 నుంచి 1953 వరకు అతిక్రూర నియంతగా పాలన సాగించాడు. సోషలిజం వచ్చిందో లేదోగాని ఎర్రసైన్యం ప్రయోగించి తూర్పు ఐరోపా అంతా ఆక్రమించింది రష్యా ఇతనికాలంలో. ఎదురు తిరిగిన కార్మిక్లు లక్షలాది చంపబడ్డారు. అతని ధోరణిని ముందే గమనించిన లెనిన్ 1924 లో చనిపోయేముందు వ్రాసిన వీలునామాతో స్టాలిన్‌ను తొలగించమని వ్రాశాడు కూడా. అయితే ఆ వీలునామాను మాయంచేసిన స్టాలిన్ క్రమక్రమంగా మెట్లెక్కి పోటీదారుల్ని పైకి పంపేశాడు. ఒకటిన్నర కోటి మందికిపైగా అతని కిరాతకత్వానికి బలయ్యారని అంచనా!

పాశ్చాత్య దేశాలతో స్పర్థ, విరోధం ప్రస్ఫుటంగా కనిపిస్తాయి స్టాలిన్ కాలంలో. మార్క్స్ పేరు మీద మరేదో సిద్ధాంతం విస్తరించింది రష్యాలో. శ్రామిక నియంతృత్వం రాలేదుగానీ నియంతృత్వం నెలకొంది. సామ్రాజ్యవాద ఫ్యూడల్ వ్యవస్థను విమర్శించిన కమ్యూనిజం అతిక్రూర నియంతృత్వాన్ని స్థిరపరిచింది.

వ్యక్తికి స్వేచ్ఛ లేకపోవటం, విమర్శించే హక్కు లేకపోవటం అనేవే కమ్యూనిజపు అంతిమ లక్ష్యాలైతే అవి సాధించబడ్డాయి లెనినిజం-స్టాలినిజం ద్వారా.

## 2. చైనాలో కమ్యూనిజం

కమ్యూనిజం పుట్టుకకు, పోషణకు దేశ చరిత్ర, సాంఘిక, రాజకీయ, సామాజిక పరిస్థితులు మూలకారణాలు. ఇన్ని దేశాలుండగా రష్యా చైనాల్లో మాత్రం కమ్యూనిస్టు విప్లవం సఫలం కావటానికి ఇవే కారణాలు.

చైనాలో సుస్థిర సామాజిక, ఆధ్యాత్మిక వ్యవస్థ లేకపోవటం, ప్రజాపీడన అధికంగా వుండటం, ఆర్థిక వ్యవస్థ అతిఘోరంగా వుండటం కమ్యూనిజం పెరుగుదలకు ముఖ్యకారణాలుగా కనిపిస్తాయి.

క్రీ పూ. 1751 నుంచి క్రీ. శ. 1911 వరకు దాదాపు 27 వంశీకులైన రాజులు భిన్న భిన్న ప్రాంతాల్ని పాలించారు చైనాలో. యాంగ్-ట్సీ నదికి ఉత్తర, దక్షిణాల వున్న ప్రాంతాలు ధార్మికంగా గాని, సామాజికంగాగాని పూర్తిగా మేళవించివుండ లే దెప్పుడు. క్రీ పూ. 551-479 ల మధ్య వున్న కన్ఫ్యూషియస్ ప్రభావం మాత్రం చైనా వారి మీద మిక్కుటంగా వుండేది. నైతికంగా పరిణతి, మంచినతం పెంపు, పెద్ద మనిషిగా వుండటం ఈలాంటి వ్యక్తిగత విషయాల మీద కన్ఫ్యూషియస్ బోధలుండేవి.

'మంచివాడు కాకపోతే ఆచారాల ప్రయోజనం ఏమిటి ?'

'మంచివాడు కాకపోతే సంగీతం యొక్క ప్రయోజనం ఏమిటి ?'

'మంచివాడు ఎవరు ?'— 'ఇతరులను ప్రేమించేవాడు'

'నీకేది ఇష్టం కాదో అది ఇతరులకు చెయ్యకు'- ఇలాంటి బోధలు కన్ఫ్యూషియస్‌వి.

ఆ తర్వాత చైనా సమాజం మీద టావోయిజం విలసిల్లింది.

చైనాలో మొదట బౌద్ధుడైనవాడు హుయి-యుయాన్ (334-416) హీనయాన, మహాయానాలు రెండూ పెంపొందాయి చైనాలో. క్రీ. శ. 502-549ల మధ్య వున్న లియాంగ్ పాలక వంశీకుడు 'ఊ' బౌద్ధం విస్తరణకు మూలకారకుడంటారు. టావో మందిరాలు ధ్వంసం చెయ్యబడి బౌద్ధ మందిరాలు, ఆరామాలు కట్టారా రోజుల్లో. యాంగ్‌ట్సీ నదికి దక్షిణాన పెరిగిన బౌద్ధం ఫో-టూ-టాంగ్-కచ్చన్‌ల ద్వారా ఉత్తరానికి పాకింది.

బౌద్ధం రాకముందు ఉత్తర చైనా సమాజంలో అనిశ్చిత స్థితి నెలకొని వుండేది. భిన్నవర్గాల మధ్య దొమ్మీలు, పోరాటాలు, మూక హత్యలతో అల్లకల్లోలంగా వుండేది సమాజం. బౌద్ధం రాకతో అన్ని వర్గాలమధ్యా విభేదాలు సమసిపోయి శాంతి నెలకొంది. బౌద్ధ పండగల్లో జరిగే సామూహిక భోజనాల్లో అంతా సమానంగా కూర్చునేవారు. ఈ కారణంగా సామాజిక ఘర్షణలు పోయి స్నేహ సౌభ్రాతృత్వాలు పెరిగాయి.

అయితే చైనా రాజకీయాల్లో ఓ విచిత్ర స్థితివుంది అనాదిగా. క్రీస్తు పూర్వం 1169 ('ఊ' రాజు) ముందునుంచే సమాజ విస్తరణ ప్రథమ ధ్యేయంగా వుండేది. రైతుల్ని కూడా సైన్యంలో బలవంతంగా చేర్చి దండయాత్రలు సాగించటం, పెద్ద సంఖ్యలో ప్రజల్ని ఇతర ప్రాంతాలకు వలసలు పంపి అక్కడి స్థానిక జనాభా నిష్పత్తిని తారుమారు చెయ్యటం జరుగుతూనే వుండేది. కమ్యూనిజం వచ్చినా చైనావారి రక్తంలో జీర్ణమైన

ఈ అలవాటు మాత్రం పోలేదనాలి. టిబెట్ ఆక్రమణ, అక్కడికి చైనీయుల్ని వలస పంపటం, 1962 లో భారత ప్రాంతాల్ని ఆక్రమించటం, ఇదంతా చైనావారి సనాతన సామ్రాజ్యవాద ఆనవాయితీలేగా!

అయితే ఈ దండయాత్రల వల్ల వలసల వల్ల ఓ స్థిరమైన శాంతియుతమైన సమాజం నెలకొనలేదేమో. మరోవైపు ఉత్తరాన మంగోలుల దండయాత్రలు, దోపిళ్ళు. ఎక్కడ ఏ రాజు బలపడితే అతని రాజ్యం. స్థిరంగా పాలించలేని రాచరిక వంశాలు ఇలా సాగిన చైనా చరిత్రలోకి విదేశీ దురాక్రమణదారులూ ప్రవేశించారు.

పాశ్చాత్య ప్రభావం తూర్పుకు సాగగా 1842 లో హాంగ్‌కాంగ్ బ్రిటన్ పాలైంది. 1854-1871 లల్లో బాల్కాష్ సరస్సు ప్రాంతం రష్యా అధీనంలోకి వెళ్ళిపోయింది. కియాచౌ జర్మనీకి (1898), కుఅంగ్ చౌయాన్ ఫ్రాన్సుకు (1898), ఆర్థర్‌రేవు (1898) రష్యాకు, తైవాన్ (1895) జపాన్‌కు అధీనమైపోయాయి. క్రీ. శ. 1900 కల్లా చైనా పరాయి రాష్ట్రాల ప్రాబల్యానికి లొంగిపోయింది. స్థూలదృష్టితో చూస్తే పంపకాలు క్రింది విధంగా వున్నాయి.

రష్యా - సింకియాంగ్, మంగోలియా, మంచూరియా ప్రాంతాలు.

జర్మనీ - షాంటుంగ్ ప్రాంతం.

ఇంగ్లాండు - స్సెచుయాన్, కుయి - చౌ, హూపై, హునాన్, హోనాన్, అన్హూ-యి, కియాంగ్సీ, కియాంగ్సు, చెకియాంగ్, తూర్పుకు అంగ్-టుంగ్ ప్రాంతాలు.

ఇలా పరాయి పాలన క్రింద వున్న చైనా సమాజ వ్యవస్థకూడా 7 వ శతాబ్దం నుంచే ఛిన్నాభిన్నమై వున్నదే. రైతులు, వారిపైన అధి

పతులు, ఆపైన చిన్న జమీందారులు, వారిపైన రాజులు ఇలా సాగింది వ్యవస్థ. క్రీ. శ. 25 కల్లా భూస్వామ్య వ్యవస్థ స్థిరపడింది. పన్నుల భారం ఉత్తర చైనాలో అధికం కాగా పెద్ద ఎత్తున రైతులు దక్షిణానికి వలస పోతూండేవారు. రాజు పెద్ద దండయాత్ర తలపెట్టిన సమయంలోనూ, గెలిచిన రాజు ఆక్రమిత ప్రాంతంమీద జులుం చలాయించే కాలంలోనూ పన్నులు అతిగా పెంచబడేవి. వసూళ్ళు అతికఠినంగా జరిగేవి.

భూస్వాముల ఆధిక్యత పెరిగి రైతులు రైతాంగ కూలీలై పోయ్యారు. సగం పంట భూస్వాములకు అప్పించుకోవటమే గాక ఇళ్ళల్లో నౌకర్లుగా అన్ని పనులూ చేసేవారు. రాజులు బలహీనమయ్యేకొద్దీ భూస్వాములు స్వంత సేనల్ని పెంచుకుని ప్రాంతీయ రాజ్యాల్ని ఏర్పరచుకుని నియంతృత్వం చెలాయించేవారు. ట్రావోపైయ్, లియుపెయ్, సున్‌చుయాన్‌లు ఇలా ఏర్పడ్డ రాజ్యాలే. ఇలా క్రమేణా చైనాలో రాష్ట్ర స్వరూపం ఛిద్రమైపోయింది.

క్రీ. శ. 1630 లో ఉత్తర చైనాలో భయంకరమైన కరువు వచ్చింది. ప్రభుత్వ యంత్రాంగం పూర్తిగా విఫలమైపోయింది. మరో రెండు శతాబ్దాలు దారీతెన్నూ లేని జీవనాలయ్యాయి చైనీయులవి. మింగ్‌లు, మంచూలు, కావోట్సుంగ్ చక్రవర్తి కొంత సమర్థ పాలనను అందించినా పటిష్టమైన సామ్రాజ్య వ్యవస్థ లుప్తమే అయింది.

చైనా చరిత్రలో జనాభా పెంపు మరో సమస్య. దండయాత్రలు; వలసలు, కరువులు, వరదలు జనాభాను కొంత అదుపులో పెట్టాయేమో మరి. 18వ శతాబ్దంలో మాత్రం చైనా జనాభా అద్వితీయంగా పెరిగింది. పాలనా వ్యవస్థ ఆ పెరుగుదల సృష్టించే సమస్యల్ని ఎదుర్కోలేక పోయింది.

ఇలాంటి సమాజంలో తిరుగుబాట్లు, ఆందోళనలు సహజంగానే వస్తాయి గదా! పాలకులు సమర్థవంతం కానప్పుడు పాలనా వ్యవస్థ ప్రజారంజకంగా ఎలావుంటుంది.. పదిమందిని పోగెయ్యగలవాడే బలవంతుడు. వాడిదే రాజ్యం రైతుల్ని పీడించటం, దోచుకోవటం మామూలు. పైగా మంగోలుల దోపిడీలు.

ఈలాటి స్థితిలో సాయుధ తిరుగుబాట్లు విచిత్రం కాదు. క్రీస్తు పూర్వం నుంచే వుండేవివి చైనాలో.

క్రీస్తు పూర్వం 208 లో చైన్ షీ ఓ సాయుధ తిరుగు బాటును లేవదీశాడు. అతను రైతు కూలీ. పాలకుల ప్రతినిధుల మీద జరిగిన తొలి తిరుగుబాటుగా పేర్కొంటారు దీన్ని. కొంత విజయం లభించగానే చెన్‌షీ తనకుతాను 'చూ' రాజు అని బిరుదు తగిలించుకున్నాడు. బానిసలు, బలవంతపు కూలీలు అతని చుట్టూ చేరారు. రాజ్యపాలనా సమర్థతలేని 'చూ' ప్రభుత్వానికి వ్యతిరేకంగా సైన్యాన్ని పంపగా వాళ్ళు పరస్పరం పోరాడుకోసాగారు. ఆ పోరాటాన్ని అనువుగా తీసుకుని లియుపాంగ్ అనే వాడు (195 క్రీ. పూ) నాయకుడుగా ఉద్భవించాడు. అతను 'హన్' వంశావళికి మూలపురుషుడు.

లియుపాంగ్ ప్రజల్ని పీడించాడు. బలవంతంగా జనాన్ని తోలుకొచ్చి రాజభవనాలు నిర్మింపచేశాడు. రోడ్లు వేయించాడు కాని తిండి ఏర్పాట్లు చెయ్యలేదు. ఆకలితో వేగిపోయేజనం తిండి గింజలకు ప్రభుత్వ గోదాముల్నే కొల్లగొట్టేవారు. పెద్దరైతుల్ని దోచుకునేవారు. మొదట కడుపు మంట చల్లార్చుకునేదానికి చేసే దోపిళ్ళు పోను పోను పెద్దఎత్తున సాగి దోపిడీ మూకలు పెరిగి అదోవ్యవస్థ అయి కూర్చుంది.

క్రీ. శ. 18 లో ఎర్రకనుబొమల 'చీ-మై' విప్లవం వచ్చింది.

184లో పచ్చ తలపాగాలు విప్లవం తెచ్చారు. ఈ విప్లవం కూడ దోపిళ్ళ విప్లవమే.

క్రీ.శ. 220లో '5 కుంచాల బియ్యం విప్లవం.

875లో వాంగ్ హ్సియన్‌చీ విప్లవం.

1121లో ఫాంగ్‌లా; 1126లో చుమియన్, 1205-62ల మధ్య ఎర్ర జాకెట్ల విప్లవం, 1352లో కువోట్జు హ్సింగ్, 14వ శతాబ్దంలో మంగోలులు; 1750-1804ల మధ్య తిరుగుబాటు బృందాల దాడులు దోపిడీలు.

చింగ్ కాలంలో రహస్య సమాజ విప్లవదార్లు, తెల్లకమలం వర్గం, 8 త్రిగ్రామ్‌లు, స్వర్గసిద్ధాంతాలు, ట్రయాడ్ సొసైటీ, పృథివి - స్వర్గ సమాజం (Heaven & Earth Society), హుంగ్‌లీగ్, 1839-42ల మధ్య నల్లమందు యుద్ధం (Opium War), 1855-78ల మధ్య ముస్లింల తిరుగుబాటు, 1854-73ల మధ్య కుయిచెవ్‌లో మియావో ఎథినిక్ మైనారిటీ తిరుగుబాటు, 1853-68ల మధ్య ఉత్తర చైనాలో నియన్ విప్లవం...ఇలా అనేక విప్లవాలతో నిండివున్న సమాజం చైనాది. శతాబ్దాల తరబడి దోపిడీకి గురవుతూ, దోపిడీలు చేస్తూ, విప్లవాలు చేస్తూ, చూస్తూ వున్నవారు చైనా ప్రజ.

అలా 19వ శతాబ్దం నుంచి 20వ శతాబ్దంలోకి అడుగుపెట్టిన చైనా నాలుగు ముఖ్యమైన పెద్ద విప్లవాన్ని చవిచూచింది.

**1. మేధావి విప్లవం:** నల్లమందు యుద్ధాల్లో విదేశీ సైనిక బలాన్ని చవిచూచిన చైనా ఆ వైఫల్యాన్ని జాతీయ అవమానంగా తీసుకుంది. పారిశ్రామిక కాలానికి ముందు సమాజంలో వున్న అనేక సమస్యలు సామాజిక విప్లవంగా రూపొందాయి. టైపెంగ్ రహస్య సమాజం, అల్ప సంఖ్యాక విప్లవాలు 1850, 1860 ల్లో చైనాను ఊపిపారేశాయి. కోట్ల ధనం నష్టమైంది. ఈ విప్లవాల్ని అణిచిన విదేశీ పాలక వర్గాలు అతినిర్ధయగా వ్యవహరించారు. చైనా ప్రజల్ని పురుగుల్లా చూడసాగారు. అవమానాల మీద అవమానాలు. సుష్టుగా తినే అలవాటున్న చైనావారిని 'పందులు' (Chinese Pigs) అని అవమానించేవారు. అసహనం పెరిగింది. మేధావి వర్గాలు అవకాశం కోసం ఎదురుచూస్తూనే వున్నాయి. అన్ని తిరుగుబాట్ల వైఫల్యాల మధ్య కూడా.

**2. రాజకీయ విప్లవం:** క్రీ.శ. 1911-12 ల్లో 2000ల సంవత్సరాల రాచరికపు వ్యవస్థను అంతం చేస్తూ 'మంచూ' వంశీకులపాలన తొలగించెయ్యబడ్డది. రిపబ్లికన్ పద్ధతిలో ప్రభుత్వం ఏర్పడింది.

1928 ప్రాంతాల్లో చైనా నైసర్గికంగా ఛిన్నాభిన్నమైవుంది. పది అధికార విభాగాలుగా వుంది. మంచూరియా, పశ్చిమోత్తర చైనా, యాంగ్‌ట్సీ నది దిగువ ప్రాంతం, మధ్య యాంగ్‌ట్సీ ప్రాంతం, ఎగువ యాంగ్‌ట్సీ ప్రాంతం, దక్షిణతీర ప్రాంతం, కాంటన్ పరిసరాల్లో పెరల్ నది డెల్టా ప్రాంతం, నైరుతి భాగం; షాంఘై, టియన్‌స్టిన్, కాంటన్ ఓడరేవు పట్టణాలన్నీ కలిపి ఓ విభాగం - ఇలా ముక్కలు చెక్కలు ఇవన్నీ విదేశీ అధికార కేంద్రాలు; (warlords) జమీందార్లు అని అందాం-వీరి పాలనాధికార ప్రాంతాలు.

నిరంతర యుద్ధాలు, విపరీతమైన పన్నుల భారం, ఒక్కసారి రెండు మూడు పాలక వర్గాల పన్నులు, ప్రజా సంక్షేమ కార్యక్రమాలన్న ప్రశ్నేలేని జీవితాలు, పెరిగే సైనిక బలాలు-ఇదీ వాతావరణం. ఈ స్థితిలో ఉన్న ఒకేదారి తిరుగుబాటు.

3) **ఆర్థికవిప్లవం** :- 19 వ శతాబ్దపు ఆఖరులో చైనా స్వసమృద్ధమైన చిన్న చిన్న రైతాంగ వ్యవస్థతో వుండేది. ఆ స్థితి నుంచి అధునాతన వాణిజ్యం, వ్యవసాయం, గ్రామీణపరిశ్రమలు, పారిశ్రామికయుగం వైపు అడుగులేస్తూ వుంది. కన్ఫ్యూషియస్ కాలానికే వాణిజ్యం వుండేది. క్రీ. శ. 1000 కల్లా, సుంగ్ వంశీకులపాలనా కాలంలో, వాణిజ్యం బాగా పెరిగింది. గృహ పరిశ్రమలు, చిన్న చిన్న పరిశ్రమలు, 19 వ శతాబ్దం ఆఖరు దశాబ్దాల్లో పెరిగాయి అధునాతన వాణిజ్య పరిశ్రమలు 1933 ప్రాంతాల్లో కూడా దేశీయ ఆర్థిక వ్యవస్థలో 2.2 శాతం మాత్రమే!

చైనాలో మారిపొయ్యే రాజవంశాల పాలనతో వాణిజ్యమూ చిత్రవిచిత్ర మలుపులు తిరిగింది. వ్యాపార ధోరణిలో లాభాల్ని పట్టి వర్తకులు ధాన్యం కొనుగోలు, అమ్మకాలు తమ ఇష్టానుసారం చెయ్యటంతో పెద్ద రైతులు మాత్రమే తట్టుకొని నిలబడగలిగారు. అలా నెగ్గుకొచ్చిన రైతులు తామూ అలాంటి వ్యాపారం చేసి చిన్న రైతుల్ని దోచేసేవారు. మావో తండ్రీ అలాంటి వ్యాపారం చేసే రైతే. అలాంటి వ్యాపారాలు చెయ్యలేని చిన్న రైతులు 30 శాతం వడ్డీలు కట్టుకుంటూ కౌళ్ళ చక్రంలో ఇరుక్కుని పొయ్యేవారు. తప్పితే పొలం వదిలి పట్నాలకు పారిపొయ్యేవారు. తప్పితే స్థానిక దోపిడీ గుంపులతో కలిసి దోపిడీలు సాగించేవాడు. చైనా చరిత్రలో చెలరేగిన అనేక విప్లవాల్లో ఇలాటివాళ్ళు కోకొల్లలుగా చేరిపొయ్యారు. 20వ శతాబ్దానికల్లా గ్రామీణ నిరుద్యోగులు, బందిపోట్లలా తిరిగే మూకలు పెరిగి సమాజంలో విచిత్ర స్థితిఏర్పడింది. మావో చెప్పిందాని ప్రకారం

ఎఱ్ఱసైన్యంలో చేరినవాళ్ళు దాదాపు 2 కోట్లమంది ఇలాంటి దారీతెన్నూ లేకుండా తిరిగే చిల్లరిమూకలే !

గ్రామాలనుంచి పట్నాలకు పోయినావారి విషయమూ ఇలాగే కల్లోల స్థితిలోపడింది.

అధిక జనాభావున్న చైనాలో కుప్పలు తెప్పలుగా వచ్చిపడే కూలి జనం దొరికినంతవరకూ తక్కువకూలీ ఇచ్చి ఎక్కువపని చేయించుకోవటం పెరిగి పోయింది. ఓపిక వున్నంతదాకా పీల్చి పారేసేవారు. షాంఘైలో, 1920 లల్లో 12 గంటలు పనికాలంగా వుండేది. చాలామంది 18 గంటలు కూడా పనిచేసేవారు. కూలి ఆరోజుల్లో లెక్క ప్రకారం రూపాయో, అర్థరూపాయో వుండేది దినానికి. ఆరు సంవత్సరాల పసివాళ్ళూ కూలీలే, స్త్రీలూ కూలీలే. వాళ్ళకు కూలి మరింత తక్కువ.

1927లో లెక్కల ప్రకారం (మావో) గ్రామాల్లో 70-80 శాతం సాగుభూమి, 8 శాతం వున్న పెద్దరైతుల చేతుల్లో వుండేది. 45 శాతం రైతులకు మాత్రమే భూమి అంటూవుండేది. అందులో 44 శాతం మందికి 10 మాన్‌లు, అంటే 1.7 ఎకరాల కంటే తక్కువ, మాత్రమే వుండేది భూమి !

ఈస్థితిలో నాలుగో విప్లవం వచ్చింది. రాగలిగింది అంటేనే మరింత సబబు ! అదే కమ్యూనిజం.

## కమ్యూనిజం పుట్టింది :

అన్నిరకాల విప్లవాలతో, దిగజారిన సామాజిక, సాంఘిక, ఆర్థిక, రాజకీయ స్థితిలో విదేశీ ఆక్రమణలతో పతనం చెందిన చైనా సమాజానికి ఆశాజ్యోతిలా కనిపించింది కమ్యూనిజం.

దారీతెన్నూ, దిక్కూమొక్కూ లేని అశేషచైనా ప్రజానీకానికి కమ్యూనిస్టు కార్యకర్తలు దేవతల్లా కనిపించారు. తమతో నడిచి, తమ మధ్య కూర్చుని తిని, తమ భాషమాట్లాడి, తమకోసం చావటానికి కూడా సిద్ధపడే కమ్యూనిస్టు నేతల్ని ఆరాధనతో చూచారు.

తమకు ఉత్తరానవున్న రష్యాలో ప్రజలకు నిష్కృతి తెచ్చిన కమ్యూనిజం. తరతరాల బానిసత్వాన్ని పారదోలే కమ్యూనిజం. తమతో సమానంగా 'కామ్రేడ్' అనిపిలిచి వెన్నుచరిచి సమానంగా కూర్చో బెట్టుకునే కమ్యూనిస్టులు ఇన్నేళ్ళకు తామూ మనుషులమేనని ధైర్యంచెప్పే వాళ్ళుదొరికారు!! ఆహా! ఇహ బంగారు భవిష్యత్తేగదా.

చైనాలో కమ్యూనిస్టుపార్టీ అనేది జులై, 1921 లో ఏర్పడింది. ఆరోజు షాంఘైలో మావోతో సహా 12 మందికలిసి రష్యావారి ప్రోద్బలంతో చైనాకమ్యూనిస్టు పార్టీ (చై. క. పా; CCP) ని ఏర్పరిచారు. చెన్-టు-హ్స్యు పార్టీ సంస్థాపకుడనాలి. ఆ తర్వాత చెప్పుకోతగ్గవాడు లీ-టా-చావో. ఈ సంఘటన చైనా చరిత్రగతిని మార్చింది. ఆ పార్టీ హఠాత్తుగా ఏమీ ఏర్పడలేదు.

దాస్ కాపిటల్‌తోసహా మరికొంత కమ్యూనిస్టు సాహిత్యాన్నితొలిగా చైనాభాషలో అనువదించింది 1919లో. 1902లో లిన్‌చిచావో ఓవ్యాసంలో మార్క్సు గురించి తొలిసారిగా ప్రస్తావించాడు. సోషలిజం రావాలి అన్నాడు. కమ్యూనిస్టు పార్టీ ముసాయిదా అనువాదాలు 1906, 1908ల ల్లోనూ, ఏంగెల్సు సాహిత్యం 1907, 1912 లల్లోనూ చైనాలోకి దిగుమతయ్యాయి.

మార్క్సు అధ్యయనబృందాలు (Study Circles) ఏర్పడ్డాయి. ఫ్యూడలిజం, పెట్టుబడిదారీ వ్యవస్థ అన్నపదాలు ప్రచారంలోకొచ్చాయి.

చైనా మేధావులు దేశాన్ని భూస్వాములనుంచి, విదేశీ ఆక్రమణ దార్లనుంచి, సామ్రాజ్యవాదులనుంచి, జమిందారుల బారినుంచి రక్షించ టానికి మార్గాలకోసం వెతికే రోజులవి. అయినా కమ్యూనిస్టు విప్లవకారు మీదనమ్మకం వుంచలేదు.

చైనాలో కమ్యూనిస్టులది నిత్యపోరాటమే. పార్టీ పెట్టేముందు, పెట్టక అధికారం హస్తగతం చేసుకొనేవాకా జరిగింది. ఓ పోరాట చరిత్ర!

రష్యాలో కమ్యూనిజం అధికారంలోకొచ్చాక అంతర్జాతీయ కమ్యూ నిస్టు సంస్థను ఏర్పరిచారు (కోమిన్‌టర్న్) కోమిన్‌టర్న్ తూర్పు ప్రాంత కార్యాలయ ప్రతినిధి వోయిటిన్‌స్కీ ఏప్రెల్, 1920 లో ఉత్తరచైనా కొచ్చాడు. పెకింగ్ విశ్వవిద్యాలయ ప్రొఫెసర్ మనుయేవ్‌తో సంప్ర దింపులు జరిపి దుబాషియాంగ్-మింగ్-చై ద్వారా లీ-టా-చావోను కలి శాడు. అతన్ని లీ షాంఘైలోని చెన్-టు-హ్సియదగ్గరకు తీసుకెళ్ళాడు. విలేకర్లను, విద్యార్థుల్ని, ఉపాధ్యాయులను, రాజకీయ నాయకుల్ని కలిసి చైనా భవిష్యత్తు గురించి చర్చించటం జరిగింది. 1911లో రిపబ్లిక్‌గా రూపొందిన చైనాలో సున్‌యట్‌సేన్ ఆదర్శాల్లో జాతీయ సోషలిజపు ఛాయల్ని చూశాడు వోయిటిన్‌స్కీ.

చెన్‌టుహ్సియు ఇంట్లో మొదటి సమావేశం జరిగింది. పార్టీ ప్రారంభించబడింది. అప్పటికి ఈ పార్టీ సున్‌యట్‌సెన్‌కు వ్యతిరేకం కాదు పార్టీ పత్రిక 'కమ్యూనిస్టు' ప్రారంభించబడింది. ఏడు ప్రచురణ లతో ఆగిపోయింది. షాంఘై, పెకింగ్, ఊహాన్, చాంగ్షా, కాంటన్ ట్సినాన్ లలో ఆరు శాఖలు తెరిచారు.

జులై, 1921లో కమ్యూనిస్టులం అని చెప్పుకునే వారు జాతీయ సభల్ని ఏర్పాటు చేశారు. పెకింగ్ నుంచి చాంగ్‌టావో, లీ-యు- జెన్

చీంగ్; షాంఘై నుంచి లీ-హన్ - చూన్, లీటాలు, అలానే ఇతర శాఖ ల్నించి ఇద్దరిద్దరు, ఊహాన్ నుంచి మావో ఈ సభలకు వచ్చారు. పోవెన్ బాలికా పాఠశాలలో సమావేశాలు జరిగాయి ఆ తర్వాత మరో 3 సభలు జరిగాయి. నాలుగోది లీ ఇంట్లో జరిగింది. ఓ పరాయి వ్యక్తి గదిలోకొచ్చి ఎవరికోసమో వెతుకుతున్నట్టు నటిస్తుండగా జనం మొత్తం పారిపొయ్యారు. లీ హన్‌చున్ మాత్రం దొరికాడు. పోలీసులకు మార్క్స్ సాహిత్యం దొరికింది. అరెస్టులు చెయ్యలేదు.

ఆఖరు సమావేశం చెకియాంగ్‌లోని దక్షిణ సరస్సు (South lake)లో పడవలో జరిగింది. త్రిసభ్య కేంద్ర పాలక వర్గం ఏర్పాటయింది. చెన్‌టుహ్సియు కార్యదర్శిగా ఎన్నుకోబడ్డాడు. మావో సభల నివేదిక తయారు చేసే లేఖకుడిగా వ్యవహరించాడు.

షాంఘై బయట ఓ కేంద్రం, కార్యకారిణి సమితులు, సభ్యులకు బోధన, శిక్షణ, అనుశాసనం నిర్వహించే వ్యవస్థ ఏర్పాటయ్యాయి. కోమిన్‌టర్న్ ధన సహాయం చేసింది. 1921 షాంఘైలో నెలకు వెయ్యి డాలర్ల చొప్పున కార్మిక సెక్రటేరియట్ నిర్వహణకు, జైలు పాలయిన వారి ఖర్చులు, ఇతర సభ్యుల ఖర్చులు కోమిన్‌టర్న్ భరించింది. సెప్టంబరు 1921 నుంచి ప్రతిపార్టీ కార్యకర్తకు నెలకు 25 డాలర్ల చొప్పున అందటమేగాక వెయ్యి డాలర్లు అందసాగాయి పార్టీకి. ఉద్యమం పెరిగే కొద్దీ నిధులు పెరిగాయి. పార్టీ కార్యాలయాల ఇళ్ళ అద్దెలు, కార్మిక వారపత్రిక, సమ్మెలు వీటన్నిటి ఖర్చు భరించారు కోమిన్‌టర్న్ వారు.

24-10-1921 నాడు షాంఘైలోని ఆంగ్ల అమెరికన్ పొగాకు కంపెనీ కార్మిక సమ్మె తర్వాత ఊహన్, ట్సినాన్, కాన్‌టన్, చాంగ్షా, పెకింగ్‌లల్లో కార్మిక సంఘాల శాఖలు ఏర్పడ్డాయి. మేడే ఉత్సవాలు,

రైలు-రోడ్డు సమ్మెలు, గనుల కార్మిక సమ్మె, చాంగ్షా దూది కర్మాగారం సమ్మె, హాంగ్‌కాంగ్ నావికా కార్మికుల సమ్మె ఇలా ఉద్యమం ఉరుకులు పరుగులు పెట్టసాగింది.

అన్నిటికంటే విజయవంతమైన సమ్మె హాంగ్‌కాంగ్‌ది లక్షమంది పాల్గొన్న సమ్మెఇది. హాంగ్‌కాంగ్ స్తంభించిపోయింది. జనవరి, 1922లో మొదలైన సమ్మె మార్చి దాకాసాగే సరికి ఆంగ్లేయులు దిగిరాక తప్పలేదు. కార్మిక సంఘాన్ని గుర్తించటం, వేతనం పెంపు ఇలా అన్నికోరికలూ అంగీకరించ బడ్డాయి.

'ఓ శతాబ్దంలో సామ్రాజ్య వాదులకు వ్యతిరేకంగా జరిగిన పోరాటంలో ప్రథమ విజయం ఇది' అన్నారు.

కమ్యూనిస్టు సభలు జరిగాయి.కార్మిక సంఘాలు విస్తరింపబడ్డాయి. మావో ఓ కార్యకర్తగా గుర్తించబడ్డాడు 10-7-22న రెండో కాంగ్రెసు చై.క.పా. ముసాయిదా వెలువడింది. విప్లవమేమార్గం అని ప్రకటించటం జరిగింది. 1922 ఆఖరులో కమ్యూనిస్టుల ప్రాబల్యం పెరిగిపోయింది. 1923 లో కమ్యూనిస్టులు వందకు పైగా సమ్మెలు నిర్వహించారు. లక్షా యాభై వేల మంది కార్మికులు పాల్గొన్నారీ సమ్మెల్లో.

అయితే ఈ కమ్యూనిస్టులకు 7-2-1923 నాడు పెద్దబ్రేకు పడ్డది. అతిశీఘ్ర పెరుగుదల క్రమ పటాపంచలైంది.

ఆనాడు పెకింగ్-హాంకౌ రైలురోడ్డు సమ్మె పెద్దఊపులో వుంది. ప్రభుత్వ తీవ్రచర్యలవల్ల చాలామంది కార్మికులు మరణించటంతో సమ్మె చెదిరి పోయింది.

విప్లవ వాతావరణం సున్‌యట్‌సేన్ వైపు తిరిగింది. జాతీయపార్టీ క్యోమింటాంగ్‌ను పునర్వ్యవస్థీకరించాడు. సున్‌యట్‌సేన్ ఈ కల్లోల వాతావరణంలో కాన్‌టన్ యుద్ధదొర చెన్ చియుంగ్ మింగ్ మీసదాడిచేసి ఓడించి తరిమేశాడతను. ఫిబ్రవరి, 1923లో స్వతంత్ర జాతీయసైన్యాన్ని నిర్మాణంచేశాడు. తన జనరల్, చియాంగ్ కై షేక్‌ను రష్యాకుపంపి ఆయుధాలను సంపాదించుకున్నాడు. అంతేగాక రష్యాసైనిక వ్యవస్థను పరిశీలించి ప్రణాళికలూ తయారుచెయ్యమన్నాడు షేక్‌ను. చైనా ప్రజానీకంలో కొంత సున్‌యట్‌సేన్ వైపు తిరిగారు. క్యోమింటాంగ్‌లో అధికంగా వ్యాపారులు, వాణిజ్యవేత్తలు సభ్యులయ్యారు.

జూన్, 1923, 10-20 తారీకుల మధ్య చై. క. పా మహాసభలు జరిగాయి. కేంద్ర కార్యకారణీ సమితి ఏర్పాటయింది. రష్యాకోమింటర్న్ వాళ్ళు క్యోమింటాంగ్‌ను గుర్తించమని, కమ్యూనిస్టులను ఐక్య ఫ్రంటులో చేరమని ఆదేశాలిచ్చారు. సున్‌యట్‌సేన్ కూడా రష్యావారితో, కమ్యూనిస్టులతో సమైక్యతకు అంగీకరించాడు.

పాశ్చాత్యుల సంతులనంలేని అంగీకారాలకు వ్యతిరేకంగా సున్‌యట్‌సేన్ పోరాటం సాగిస్తూనే వున్నాడు. డిశంబరు 1923 లో నావికా కస్టమ్స్‌లో తమకు (చైనీయులకు) భాగం ఇవ్వాల్సిందే అంటూ నోటీసులు జారీచేశాడు సున్‌యట్‌సేన్ - జవాబుగా అమెరికా పెద్దనావికా దళాన్ని పంపించి. మిగతా పాశ్చాత్య రాజ్యాలు కాంటన్ నావికాశ్రయంలో పతాకాలు ఎగరేసి సవాలు విసిరాయి 'మాముఖాలిక రష్యావైపు తిరిగాయి' అని ప్రకటించాడు సన్‌యట్‌సేన్. కమ్యూనిస్టుకు అన్ని కమిటీల్లో ప్రాతినిథ్యం పెరిగింది.

సైనిక పాఠశాల స్థాపించబడింది. 36 సంవత్సరాల చియాంగ్ - కై - షేక్ సైనికాధికారిగా ఆ పాఠశాల పని నిర్వహించసాగాడు.

1924 ఆఖరులో చౌయన్‌లై ఫ్రాన్సునుంచి తిరిగొచ్చాడు. చెన్ ఈ లిన్‌పియావోలు కూడా కమ్యూనిస్టు పార్టీ బాధ్యతలు ఆ రోజుల్లోనే చేబట్టారు.

పైకి క్యోమింటాంగ్‌తో చేతులు కలిపినా లోలోపల ఆ సంస్థలో వామపక్షీయుల్ని చీల్చసాగారు కమ్యూనిస్టులు.

జనవరి, 11-22, 1925 తేదీల్లో షాంఘైలో నాలుగో చై. క. పా సభలు జరిగాయి. ఆ సభలకు మావో హాజరుకాలేదు. జాతీయ క్యోమింటాంగ్‌తో సంబంధాల విషయంలో కమ్యూనిస్టుల్లో వర్గాలు ఏర్పడ్డాయి. మావో హునాన్ వెళ్ళిపొయ్యాడు.

మార్చి, 1925 లో సున్‌యట్ సేన్ చనిపొయ్యాడు.

కార్మిక ఆందోళనలు కమ్యూనిస్టుల ముఖ్య కార్యక్రమాలుగా కొనసాగాయి. మే, 15, 1925 న షాంఘైలోని జపాన్‌వారి బట్టల మిల్లులో సమ్మె ప్రారంభమైంది. కొట్లాటలో ఓ కార్మికుడు మరణించాడు. సమ్మె విస్తరించింది. మే, 30 న నాన్‌కింగ్ రోడ్డులో సమైక్య ప్రదర్శన జరిగింది. అంతర్జాతీయ వలస కేంద్రం నుంచి ఆంగ్ల అధికారి కాల్పులు జరిపాడు. 10 మంది కార్మికులు మరణించారు. వందలాది గాయపడ్డారు సమ్మె 12 పట్నాలకు వ్యాపించింది.

జూన్, 23 న కాంటన్-షాకీ రోడ్డులో అతిపెద్ద ప్రదర్శన జరిగింది. ఆంగ్ల, ఫ్రెంచి సైనికులు కాల్పులు జరిపారు. 52 మంది నేలకొరిగార్రు.

తటస్థంగా వుండే కార్మికులు ఈ సంఘటనతో రెచ్చిపోయిన సమ్మెలో చేరారు. పట్టుదలలు పెరిగాయి.

ఈ సమ్మె అతిదీర్ఘకాలికమైంది చైనాలో. అక్టోబరు, 1926 దాకా, అంటే 16 నెలలు జరిగిన సమ్మె ఇది. కార్మికుల మీద కమ్యూనిస్టుల ప్రాబల్యం పెరిగిపోయింది. పార్టీ నేతలు మూక ఆందోళనల్లోని శక్తిని రుచిచూడ సాగారు. సమ్మె విజయవంతమవగానే కమ్యూనిస్టులు ఓ శక్తిగా నిలబడ్డారు.

రైతాంగంలో ఇంకా వీరి పలుకుడి పెరగలేదు.

అటు జాతీయ పార్టీ అధికారం పటిష్టం కాసాగింది. అదేకాలంలో జపాన్ మంచూరియా మీద అధికారం పటిష్టం చేసుకోసాగింది. దానికి ఆంగ్లేయుల మద్దతూ వుంది. రష్యావారికిది కష్టంగావుంది. చియాంగ్ కై షేక్ ఉత్తరచైనా వార్‌లార్డ్స్ (War lords) మీదికి యుద్ధ ప్రయత్నాలు చేస్తూ రష్యావారిని ఆయుధాలకోసం వేధించసాగాడు కమ్యూనిస్టులు బలపడకుండా ఎన్నో నిబంధనలు పెంచాడు, అరెస్టులు చేశాడు. చియ్యాంగ్ కై షేక్. ఈ పరిస్థితుల్లో జపాన్ వారికి, పాశ్చాత్యులకు ఎదురు నిలబెట్టగల చియాంగ్‌ను వదులుకోదల్చుకోలేదు రష్యా. అతని కోరికలు తీర్చటానికి ఒప్పుకున్నారు.

జులై 1926లో ఉత్తర చైనా వార్‌లార్డ్స్ మీదికి యుద్ధం మొదలెట్టాడు చియాంగ్ కై షేక్. దశాబ్దాల వార్‌లార్డ్స్ పాలనను దక్షిణ మధ్య చైనాలో తొలగించారు చియాంగ్ సైనికులు. క్రమంగా కియాంగ్‌సీ, ఫ్యూకియాన్, కియాంగ్సు, చెకియాంగ్ ప్రాంతాల్లో విజయాలు సాధించాడు చియాంగ్.

ఇటు కమ్యూనిస్టులు చియాంగ్‌ను పదవీచ్యుతుడ్ని చెయ్యాలని పట్టు బట్టసాగారు. కానీ రష్యావారు మొగ్గుచూపలేదు.

వార్‌లార్డ్స్ తొలగాక ఆయా ప్రాంతాల్లో అధికార లుప్తం ఏర్పడింది. భిన్నవర్గాలు ఎగబడి పన్నులు వసూలుచెయ్య సాగారు. ప్రజల కష్టాలు పెరిగాయి. అసంతృప్తి పెరిగింది. తిరుగుబాట్లు పెరిగాయి. చైనా చరిత్రలో రైతులు తమంతతామే ఉద్యమాలు నడపటం విశేషం. ఈ స్థితిలో అలానే రైతులు ధాన్యాగారాల్ని తెరిచారు, దోచుకున్నారు, భూముల్ని ఆక్రమించారు, ఆస్తుల్ని స్వాధీనం చేసుకున్నారు, ఎదురు తిరిగిన వాళ్ళను చావదన్ని చెవులుమూశారు తప్పితే చంపి పారేశారు.

మావో ప్రకటించినదాని ప్రకారం రైతాంగ సంస్థ రైతులదే, ఉద్యమం వాళ్ళదే. అంటే కమ్యూనిస్టుల ప్రభావం ఏమీలేదు. ఆ తర్వాత 40 సంవత్సరాలకు మావో ఇలా ప్రకటించాడు ఓ సందర్భంలో "మేం రైతుల ఉద్యమాన్ని సరియైన పంథాలో నడిపాం. అంతేగాని దాన్ని మేము సృష్టించలేదు".

"వేల లక్షల మంది రైతులు తుఫానులా, గాలిదుమారంలా ఉధృతంగా లేస్తారు. వారి వేగం అతీతం. ఏ శక్తీ ఆ ఉధృతాన్ని ఆపలేదు, అణచలేదు" అన్నారు మావో పాలనలో కొచ్చాక.

రైతులు జాతీయవాదులది, వార్‌లార్డ్స్‌ది అని తేడాచూపకుండా భూముల మీద విరుచుకపడ్డారు.

నాన్‌చాంగ్ (నాన్‌కింగ్), వూహాన్‌లల్లో దొమ్మీలు పెరిగాయి. ఈ స్థితిలో చియాంగ్ అధికారాన్ని హస్తగతం చేసుకున్నాడు. కాని రాజధాని విషయంలో జాతీయవాదుల్లో స్పర్థలొచ్చాయి. షాంఘై రాజధాని కావాలని కొందరు, కాదు పెకింగ్ (బీజింగ్) అని కొందర్లూ తగాదా పడ్డారు

చియాంగ్ బీజింగ్ వాదుల్నే సమర్థించాడు. కమ్యూనిస్టులు స్వతంత్రంగా అధికారాన్ని చేబట్టే స్థితిలో లేరు. రష్యావారి ఆదేశానుసారం (నేషనలిస్టులను) జాతీయవాదుల్నే సమర్థించక తప్పలేదు. చియాంగ్ కై షేక్ జాతీయ విప్లవ సైన్యానికి సైన్యాధ్యక్షుడుగా కొనసాగాడు. ఏడుగురు సభ్యుల ప్లీనం ఏర్పాటైంది. అందులో కమ్యూనిస్టులకు స్థానం ఇవ్వబడ్డది. 9 మంది వున్న స్టాండింగు కమిటీలోకూడా ఇద్దరు కమ్యూనిస్టులు చేర్చుకోబడ్డారు.

చియాంగ్‌కు మాత్రం కమ్యూనిస్టులంటే అంత సహనంలేదు. 'వీళ్ళు మరీ శక్తివంతులైతే కష్టం హద్దులోవుంచాలి' అన్నాడు తొలిరోజుల్లోనే. రష్యా మద్దతు కోసం కలిసినట్లు నటించేవాడు.

ఫిబ్రవరి, 27, 1927లో చియాంగ్ సైన్యాలు షాంఘై ఆక్రమణకు బయలు దేరాయి. షాంఘైలో కమ్యూనిస్టులు కార్మికసమ్మె చేయించి జీవనాన్ని స్తంభింపజేశారు. ఇది జాతీయ సైన్యానికి సహాయంగా వుంటానికి చేసినపని. లక్షల కార్మికులు సమ్మెలో పాల్గొని 'చియాంగ్‌కు జై!' అంటూ నినాదాలుచేస్తూ షాంఘైని అదరగొట్టేశారు.

చియాంగ్ షాంఘైకి 25 మైళ్ళ దూరన తన సైన్యాలతో ఆగిపొయ్యాడు. షాంఘైలో వీధి పోరాటాలు చెలరేగాయి. వందలాది ప్రదర్శనకారులు చంపబడ్డారు, గాయపరచ బడ్డారు. రష్యా కోమిన్‌టర్న్ ప్రతినిధి వోయిటిన్స్కీని 'బూర్జువాలతో చేతులు కలిపాడు' అని నిందించారు కమ్యూనిస్టులు. అంతా అల్లకల్లోలం, గందరగోళం. అధికారం వీధుల్లో వుంది. కానీ కమ్యూనిస్టు పార్టీ దాన్నెలా చేజిక్కించుకోవాలో తెలీనిస్థితిలో పడిపోయింది. ఇంకా నీచమేమంటే అధికారం చేబట్టటానికి సుముఖంగా లేదు అని మొత్తుకున్నడో చిరునేత. 21-3-1927న 6,00,000ల మంది కార్మికులు సైన్యంతో అమీతుమీ తేల్చుకోవటానికి ఉద్యోగాలు వదిలేశారు.

అయినా కమ్యూనిస్టులు ఏమీచెయ్యలేని స్థితిలో అవకాశాన్ని వదులుకున్నారు. మార్చి 22న చియాంగ్ షాంఘై చేరాడు కేవలం 3000 మంది సైనంతో.

షాంఘైలోని ఆకుపచ్చ గ్యాంగులకు (Green Gangs) ఆయుధాలిచ్చి రెచ్చగొట్టాడు చియాంగ్. ఇతర రహస్య సంస్థలనూ చేరదీశాడు. వీళ్ళందరూ కార్మిక కేంద్రాల మీద విరుచుకపడ్డారు వామపక్ష జాతీయవాదులు, కమ్యూనిస్టులు బందీలయ్యారు. వాంగ్-షౌ-హుఆ, చౌయన్‌లైలు కూడా అరెస్టయ్యారు. వాంగ్ చంపబడ్డాడు. ఏప్రెల్ 13న ప్రదర్శనలు జరిగాయి. వందలాది మంది చంపబడ్డారు. కమ్యూనిస్టులు పశ్చిమానికి పారిపొయ్యారు తప్పితే అండర్‌గ్రౌండ్‌లోకి వెళ్ళిపొయ్యారు. షాంఘైలో చియాంగ్ అధికారం స్థిరపడింది. ఏప్రెల్, 18న జాతీయ ప్రభుత్వాన్ని ఏర్పరిచాడు చియాంగ్ నాన్‌కింగ్‌లో.

ఇంకా రష్యావారు చియాంగ్‌నే సమర్థించారు. వార్‌లార్డ్సు, చియాంగ్ ఇద్దరూ ద్వంద్వ శత్రువులుగా ప్రకటించారు కమ్యూనిస్టులు.

అయితే కోమింటాంగ్ సభ్యత్వం పెరిగిపోయింది ఆతర్వాత.

15-7-1928 న రష్యావారు చూ-చియు-పై (28 సం॥) ని చైనా నేతగా నియమించారు. చూ-చౌయన్‌లైలతో కొత్త అధికారవర్గం ఏర్పడింది. కమ్యూనిస్టులు ఎదురుదెబ్బతీసే ధోరణిచే బట్టాలని నిర్ణయమైంది. ఎర్ర సైన్యం ఏర్పాటు ఆలోచన తొలిసారిగా ఏర్పడ్డది. ఆ తర్వాత 22 సంవత్సరాలకు లభించిన విజయానికి పునాది ఇది.

ఊహాన్‌లో ఎర్ర సైన్యం పెరిగింది త్వరత్వరగా. చౌయన్‌లై లీపీసాన్, లిన్ - పో - చూ లతో 20,000ల మంది ఎర్ర సైనికులు 1-8-1927 ఉదయపు ఉషస్సులో 5000 మంది జాతీయ సైనికుల మీద

బడి వాళ్ళను నిరాయుధుల్ని చేసి నాన్‌కింగును ఆక్రమించారు. విప్లవ సమితి ఛెయిర్మెన్‌గా టాన్ పింగ్ షాన్; చౌయన్‌లై మరి 5 గురు సైనిక జనరల్స్‌గా నియామకం అయి పాలన ప్రారంభించారు. మావో అప్పటికి చిన్న కార్యకర్తే హూనాన్‌లో ఎర్రసైన్య నిర్మాణం అతని బాధ్యత.

జాతీయవాదులు త్వరగా తేరుకుని కమ్యూనిస్టు ఎర్రసైన్యాల మీద విరుచుక పడ్డారు. 5-8-1927 కల్లా కమ్యూనిస్టులు లక్ష చైనా డాలర్లు, ఆహారపదార్థాలతో క్వాంగ్‌టుంగ్ లోని హై - లు - ఫెంగ్ వైపు పారిపో సాగారు. దోవలో పోరాటాలు, అవకతవకల వల్ల అంతా పోగా 2000 మంది హైలుఫెంగ్ చేరారు. అలా విఫలమైంది. కమ్యూనిస్టుల తొలి సాహసం.

'రైతుల దుర్భరస్థితి ఆధారంగా రైతాంగ విప్లవం తేవాలి' అని మావో ప్రతిపాదించాడు. ఆ తర్వాతి మహాసభల్లో "మొత్తం భూమిని స్వాధీనం చేసుకోవాలి. గ్రామ పెద్దల్ని చంపండి. ఎదురు తిరిగినవాళ్ళను విప్లవ ద్రోహుల్ని చెడ్డవారిని చంపేసి వాళ్ళఆస్తుల్ని స్వాధీనం చేసుకోండి. రైతుసంఘాలకు సంపూర్ణ అధికారాలివ్వండి. రైతులు, కార్మికులు తప్ప మిగతా అందర్నీ నిరాయుధుల్ని చెయ్యండి." ఇది మావో ముసాయిదా. కానీ కేంద్రపార్టీ కార్యకారిణీ దీనికి ఒప్పుకోలేదు.

మావో గెరిల్లా యుద్ధ పద్ధతులు మొదలెట్టాడు.

సెప్టెంబరు, 1927లో ఓ రైలు దోచుకున్నారు ఎర్రసైనికులు. ఆయుధాలు, 34000 చైనా డాలర్లు దోచుకోబడ్డవి. తర్వాత మరిన్ని సంఘటనలు జరిగాయి. మావో గెరిల్లా యుద్ధనేతగా పేరుపొందాడు.

డిశంబరు, 13న కాంటన్ ఆక్రమణకుదాడి చేశారు కమ్యూనిస్టులు. విఫలమైంది. చాలా మంది కమ్యూనిస్టులు చావగా 1500 మంది రిపో పోయ్యారు. ప్రజలెవ్వరూ సానుభూతి చూపలేదు.

కానీ మావో గెరిల్లా కార్యక్రమాలు కొనసాగాయి. 1931వ సంవత్సరానికి మావో బలపడ్డాడు. రైతుల పనులు సహకారం రైతాంగ విప్లవాలు మావోను నేతగామలిచాయి.

కమ్యూనిస్టుల నేతృత్వంలో ఎర్ర సైన్యం పటిష్టం కాసాగింది. వర్గ పోరాటాల దృష్టికోణం ఏర్పడింది. హై-లు-ఫెంగ్‌లో కమ్యూనిస్టులే పాలనను అధీనం చేసుకున్నారు. గ్రామాల్లో పరపతి పెరిగింది. కొన్ని సిద్ధాంతాలు బలపడ్డాయి.

'విప్లవ వ్యతిరేకుల పట్ల మెత్తదనం పనికిరాదు.

ఒక్కడ్నీ వలలోంచి జారిపోనివ్వొద్దు.

పొరబాటులు ఇతరుల్ని కొందరు చంపినా పర్వాలేదు.

విప్లవ వ్యతిరేకుల ఇళ్ళు, గ్రామాలు ధ్వంసం చేయ్యాలి,

తగలబెట్టాలి.'

అలాగే సాగింది కార్యక్రమం. స్వాధీనం చేసుకున్న పొలాల్ని భూముల్లేని పేద రైతులకు పంచిపెట్టారు కమ్యూనిస్టులు.

హూనాన్, హుపేలల్లో కమ్యూనిస్టుల భీతావహాన్ని సృష్టించారు

కమ్యూనిస్టు సైన్యాల సంఖ్య 10,000ల వరకు పెరిగింది.

మావో రాజకీయంగా బలపడ్డాడు.

సైన్యం వ్యవస్థీకరించబడింది.

ప్రతి కంపెనీలో 150 మంది ఎర్ర సైనికులుంటారు. 4 కంపెనీలు ఒక బెటాలియన్ 3 బెటాలియన్లు ఒక రెజిమెంటు.

నాన్‌కాంగ్‌లో 1-8-1928 నాడు 4 వ ఎర్ర సైన్యపు కమాండరుగా 'చూటెహ్' నియమించబడ్డాడు. ఇదే తొలి కార్ప్స్‌గా ఆ తర్వాత ప్రథమ ఫ్రంటు సైన్యంగా పేరుపొందిన ఎర్ర సైనిక విభాగం.

కమ్యూనిజంలో 6 సిద్ధాంతాలు రూపుదాల్చాయి.

1. ఎర్ర సైన్యం వ్యవస్థ పెంపు.
2. గ్రామీణ పోరాటాన్ని ప్రారంభించటం.
3. భూ సంస్కరణలు కొనసాగించటం.
4. సోవియట్ ( ! ) ప్రభుత్వాన్ని ఏర్పరచటం
   (అప్పటికి చైనా కమ్యూనిస్టులకు స్వతంత్ర ప్రభుత్వాలు ఏర్పరిచే ధోరణి లేదు.)
5. ప్రజావాహినికి ఆయుధా లందివ్వటం.
6. జాతీయ ప్రభుత్వాన్ని కూలదొయ్యటం.

అయినా చీలికలున్నాయి కమ్యూనిస్టుల్లో. 5 ముఖ్య వర్గాలుండేవి 1928 లో. కేంద్ర కమిటీ వర్గం, చేయన్‌లై, లీపీహాన్ మొ॥; పెకింగ్ వర్గం; యువవర్గం, ఎర్ర సైన్యం నేతలు మావో, చూటే మొ॥; ట్రోట్స్కీ వర్గం (రష్యాలో చీలికకు అనుగుణంగా).

అంతర్గత పోరాటాల్లో 121 మంది నేతలు చనిపోయ్యారు. 53 మంది గతి తెలీదు.

మరోవైపు చియాంగ్ కై షేక్ బలపడ్డాడు. అవకాశం దొరికి నప్పుడల్లా కమ్యూనిస్టుల మీద దెబ్బతీస్తూనే వున్నాడు.

1928 ఆఖరుకల్లా వార్‌లార్డ్స్‌ను అంతం చేశాడు చియాంగ్. అతని సైనిక బలమూ నాలుగున్నర లక్షలకు పెరిగింది.

1928 లో పదివేలను మించని ఎర్రసైన్యం 1930 కి లక్షదాకా 1933 కు మూడు లక్షలకూ పెరిగింది. అయితే పట్నాల్లో కమ్యూనిజం పెరగలేదు. పార్టీ బహిష్కరణలు, తగదాలు కొనసాగాయి.

ఇదిలా వుండగా మరోవైపు జపాన్ మంచురియాను ఆక్రమించింది (సెప్టెంబరు, 1931). పాశ్చాత్యులు చైనా వ్యతిరేక ఒప్పందాలతో లాభాలు పెంచుకుని పోతూనేవున్నారు. వాళ్ళకూ సైన్యాలు పెరిగాయి. 'చైనా జాతికి అవమానాలు' అన్న నినాదంతో చియాంగ్-కై-షేక్ పాలకుడిగా నిలదొక్కుకో సాగాడు. రష్యా పాలనలో యాంగ్‌ట్జీ నది పరిసరాల్లో 8 స్వతంత్ర ప్రాంతాలు ఏర్పడ్డాయి. చైనా కమ్యూనిస్టుల కేంద్రాలివి.

1930 లలో చైనా నైసర్గిక, రాజకీయ పరిస్థితి ఇలావుంది.

ప్రస్తుత పుస్తకంలో లీ-లీసాన్ సిద్ధాంతాలు, దానివల్ల పార్టీలో చీలికలు, విభేదాల వల్ల చౌయన్‌లై రష్యాకు వెళ్ళిపోవటం - ఈ వివరాలు చర్చించటం లేదు. కమ్యూనిజం పెంపు, ప్రజల్లో కమ్యూనిస్టుల పరపతి, తొలి రోజుల్లో కమ్యూనిస్టుల సేవాభావం మాత్రం చర్చించటం జరిగింది.

## 3. సుదీర్ఘ సంచలనం :

అంతర్గత కలహాలవల్ల, చియాంగ్ కై షేక్ దాడులవల్ల కమ్యూనిస్టులు 8 రష్యా పాలిత ప్రాంతాల్లో కేంద్రీకృతం అయ్యారు. 1932 లో జపాన్ మంచూరియాను పూర్తిగా ఆక్రమించి 1933 లో మంగోలియాను

అక్రమించింది. 1934 లో చైనా మొత్తంలో సంరక్షిత పాలనను (Protectorate) తన చేతుల్లోకి తీసుకోవాలనే ప్రయత్నాలు చెయ్యసాగింది జపాన్. కమ్యూనిస్టులు జపాన్ మీద యుద్ధం ప్రకటించారు. కానీ ఆయుధ రూపేణా, సైనికబలం రీత్యా ఉన్నత స్థాయిలోవున్న జపాన్‌ను కమ్యూనిస్టులు ఏమీ చెయ్యలేకపొయ్యారు.

కన్ఫ్యూషియన్ సూత్రం 'దేశాన్ని పాలించే వాడు ముందు కుటుంబాన్ని పాలించాలి' అన్నది నిజమైంది.

చియాంగ్ కూడా జపాన్‌తో పోరాడి నెగ్గలేదు. అయితే కమ్యూనిస్టుల మీద వత్తిడి పెంచాడు. స్థానిక ప్రజల్ని కమ్యూనిస్టుల మీదికి ఉసిగొల్పటంతో చియాంగ్ మరింత గెలుపు సాధించాడు. రష్యా ప్రాంతాలు ఎనిమిదింటి మీదా దృష్టి సారించి వాటి చుట్టూ అష్టదిగ్బంధనం చేసేశాడు చియాంగ్. ఉరిబిగిసింది. ఉప్పుకూడా దొరకని స్థితి ఏర్పడింది ఆ 8 ప్రాంతాల్లో. పైగా దాడులు పెరిగాయి. ఈ దిగ్బంధాన్ని ఛేదించుకుని భిన్న దళాలు విభిన్న మార్గాల్లో సంచలనం సాగించాయి. మే, 1934లో మొదలైన ఈ సంచలనం లాంగ్ మార్చి (Long March)గా ప్రఖ్యాతి నొందింది చైనా కమ్యూనిజం చరిత్రలో 'మరణం దాకా విజయం' అన్న నినాదంతో ఎర్రసైన్యంలో జనాన్ని చేర్చుకుంటూ ముందుకు సాగింది కమ్యూనిజం.

పన్నెండు నెలల సంచలనం! విమాన దాడులు, ఆటంకాలు, చక్రీయబంధనాలు, అకస్మాత్ దాడులు, మొత్తం 20,000 లీ, అంటే 6,600 మైళ్ళను మించిన సంచలనం. 11 ప్రాంతాల్లో నుంచి చేసినకవాతు బయలుదేరిన వాళ్ళల్లో పదోవంతు బ్రతికి తుది మజిలీ చేరారు.

మావో దళం 235 పగళ్లు, 18 రాత్రులు నడిచారు. దినానికి సరాసరిన 17 మైళ్ళ నడకసాగింది. 18 పర్వతాల్ని, 24 నదుల్ని అధిగమించారు. అసంఖ్యాక పోరాటాలు జరిపారు.

ఇతర వర్గాలు చాన్‌కువో టావో, వోయింగ్, లిన్‌పియావో, పెంగ్‌టెహోహుయాయి, చూటెహ్, చౌయన్‌లై, వాంగ్‌చియా, లియుపోచెంగ్, డెంగ్‌గ్జియావోపింగ్, ఇలా అనేకుల ఆధ్వర్యాన భిన్నమార్గాల్లో సంచలనం చేశారు.

దోవలోని గ్రామాల్లో రైతులకు కుప్పనూర్పిళ్ళు, నాట్లు. గృహనిర్మాణాలు, ఇలా ఎన్నింటిలోనో సహాయం చేస్తూ సాగింది కమ్యూనిజం దళం. అనువైన చోట్ల భూమిని ఫ్యూడల్ దొరల నుంచి లాక్కొని బీదలకు పంచారు. వర్గ శత్రువుల్ని నరికారు. యువకుల్ని ఎర్రసైన్యంలో చేర్చుకున్నారు.

వేలాది సామాన్లు మోసేవారు, 7000 మంది రాజకీయ కార్యకర్తలు నర్సులు, డాక్టర్లు, లక్షల జనం తెలీని భవిష్యత్తు వైపు సాగిపొయ్యారీ సంచలనంలో.

మావో భార్య, సోదరి, సోదరుడు ఇలా మరి కొందరు సన్నిహితులు నిహతులయ్యారు 1930-35 సంవత్సరాల మధ్య సంచనలం నాటికి మావో రెండో భార్య గర్భవతి దోవలోనే ప్రసవించి చనిపోయింది కూడా. సంచలనంలో మావోకు మలేరియా సోకింది తీవ్రంగా. అలాగే చౌయన్‌లైకి కూడా మలేరియా పట్టుకుంది. జనం ఇద్దర్ని బల్లలకు కట్టి మోశారు. పగలు నిద్రించేవారు నేతలు. రాత్రిళ్ళు రహస్యచార వార్తల పరిశీలన, యోజనల నిర్ణయం, చర్చలతో పొద్దుపోయేది. నాయకులు ఆహారాన్ని, బట్టలను, బూట్లను కమ్యూనిస్టు కార్యకర్తలతో సమానంగా పంచుకునే వారు

మావో రెండు గొంగళ్ళు, ఒక (బెడ్‌షీట్) దుప్పటి, చిరుగులు పట్టిన పైకోటు, కొన్ని బట్టలు, గొడుగు, పుస్తకాలు స్వయంగా మోసుకుని నడిచారు.

20-2-1936 నాటి రాత్రి కమ్యూనిస్టు దళాలు గడ్డకట్టిన పచ్చనది (Yellow River) ని దాటి షాన్సీ ప్రాంతాన్ని ప్రవేశించాయి. జాతీయ సైన్యంతో పోరాటం మొదలైంది.

మార్చి, 14 న "చియాంగ్ ఎర్ర సైన్యం మీద దాడులు ఆపితే మా సైన్యం పోరాటం ఆపి జపాన్‌తో పోరాడుతుంద" అని ప్రకటించాడు మావో.

సుదీర్ఘ సంచలనం ముగిసేసరికి కమ్యూనిస్టులు షాన్సీ ఉత్తర ప్రాంతంలో అధికారాన్ని హస్తగతం చేసుకున్నారు.

1937 లో కూడా మావో పెద్ద నాయకుడు కాదు. కొంత గుర్తింపు వుంది అతనికి. అంతే రష్యా, చియాంగ్‌తో కలిసే వుండమని వత్తిడి చేస్తూనే వుంది కమ్యూనిస్టుల్ని, చియాంగె చైనా నేతవాళ్ళ దృష్టిలో.

లాంగ్ మార్చి ఫలితంగా కమ్యూనిస్టులు సంఖ్యాత్మకంగా పెరిగారు.

1937 లో జపాన్‌తో యుద్ధం మొదలైంది. కానీ జపాన్ వారు విజయాల తర్వాత విజయాలతో లోపలి మంగోలియా (4-9-37) పైపింగ్ (14-12-37), నాన్‌కింగ్ (28-3-38), ఈశాన్యం, అన్ని తీరపట్నాలూ (1939) ఆక్రమించారు.

మే, 1944 లో మరో ఊపుతో జాతీయ సైన్యాల్ని తరిమేసి మధ్య చైనా, నైఋతీ ప్రాంతం ఆక్రమించారు జపాన్‌వారు.

రెండో ప్రపంచ యుద్ధం తీవ్రతరం అయిన ఈ రోజుల్లో అమెరికా అధ్యక్షుడు రూజ్వెల్ట్, హెన్రీ. ఎ. వాల్లెస్‌ను చైనాకు సంధికి పంపాడు. జపాన్ వ్యతిరేక శక్తుల్ని సమీకరించి యుద్ధానికి తయారుచేశారు వాల్లెస్. ఆ సంధిపత్రం మీద మావో సంతకం చేశాడు. అంటే చై. క. పార్టీ గుర్తింపు, మావో నేతృత్వం గుర్తింపు అప్పటికి అంతర్జాతీయంగా స్థిర పడ్డాయి.

1945 లో చైనా కమ్యూనిస్టు పార్టీ కేంద్ర సభలు జరిగాయి. కేంద్ర కమిటీ ఛైర్మన్‌గా మావో ఎన్నికయ్యాడు.

ఆగస్టు, 1945లో హిరోషిమా, నాగసాకీలమీద అణుబాంబుల ప్రయోగంతో జపాన్ నడుము విరిగింది.

8-9-1945 రష్యా మంచూరియామీద దాడి చేసింది.

కమ్యూనిస్టులు జపాన్ ఆక్రమణలోని పట్నాల్ని, ప్రసారణా వ్యవస్థను చేజిక్కించుకున్నాయి. అమెరికన్ల సహాయంతో జాతీయ సైన్యాలు జపాన్ సైన్యాల్ని నిరాయుధుల్ని చేశాయి చియాంగ్ సైన్యాలకే ఆయుధాల్ని అప్పగించమని అమెరికన్ల ఆదేశం.

ఈ గొడవలో కమ్యూనిస్టులు మంచూరియాలో వున్న 5 లక్షల జపాన్ సైనికుల ఆయుధాల్ని స్వాధీనం చేసుకున్నారు. రష్యా సహా యంతో మంచూరియాలో తాము అధికారం చెలాయిద్దామనుకున్నారు చైనా కమ్యూనిస్టులు.

యాల్టాలో జరిగిన సంధి ప్రకారం రష్యా మంచూరియాను ఆక్ర మించింది. తమకు సహాయంగా నిలబడి తమకా ప్రాంతాన్ని అప్పగిస్తారని ఆశించిన కమ్యూనిస్టుల ఆశలు నిరాశలయ్యాయి. 1945 ఆఖరు లోగా యుద్ధ లాభం క్రింద మంచూరియాలోని తొమ్మిది లక్షల డాలర్ల విలువ

గల యంత్ర పరికరాల్ని రష్యాకు తరలించుకవెళ్ళారు సహోదర రష్యన్ కమ్యూనిస్టులు.

ఏప్రెల్, 46లో రష్యన్లు హఠాత్తుగా మంచూరియా వదిలి వెళ్ళారు. కమ్యూనిస్టులు ఆక్రమించుకో ప్రయత్నించగా జాతీయ సైన్యంతో భీకర పోరాటం ఎదురైంది. రష్యన్లు అటు చియాంగ్‌తో ఇటు కమ్యూనిస్టులతో ద్వంద్వ సిద్ధాంతాన్ని నడిపి అందినంత దోచుకపోగా వీళ్ళిద్దరికీ యుద్ధం మిగిలింది.

సెప్టెంబరు, 1946కు గానీ చైనా కమ్యూనిస్టులు కళ్ళు తెరిచి రష్యాతో తెగతెంపులు చేసుకోలేదు.

ప్రపంచ సోదర అంతర్జాతీయ కమ్యూనిజపు బాంధవ్యం అలా తెల్లవారింది.

19-8-46 నుంచి కమ్యూనిస్టులు అమెరికా స్థావరాలమీద దాడులు చేశాయి. జపాన్‌వారి ఆయుధాలు అనువుగా పనికొచ్చాయి ఈ పోరాటాల్లో.

డిశంబరు 46, జనవరి, 47ల్లో కమ్యూనిస్టులు విద్యార్థుల ప్రదర్శనలను రేకెత్తించారు. ఎవడో ఓ అమెరికన్ ఒక చైనా పిల్లను చెరిచాడన్నది కారణం.

ఎర్రసైన్యంలో 4వ, 8వ విభాగాలకు ప్రజావిముక్తసైన్యం అని జులై, 46లో పేరుపెట్టి జాతీయసైన్యంతో తుది యుద్ధానికి ప్రారంభోత్సవం చేశారు. కమూనిస్టు చైనాలో ఈనాటి పి. యల్. ఏ (PLA) తొలిదశ అదే!

**1947** తొలిమాసాల్లో మంచూరియా, హోపెహ్, షాన్‌టుంగ్‌లతో ప్రారంభమైన విజయాలు హినాన్ (ఏప్రిల్), షాన్సీ (మే), దక్షిణ మంచూరియా (జూన్)లను ధాటుకుంటూ అక్టోబరు, 47 కల్లా లిన్ పియావో అధ్య

ర్యంలోని సైన్యం దక్షిణానవున్న జాతీయ సైనిక స్థావరాల సంబంధాల్ని తెంపేస్తూ అన్ని రైలు, రహదారుల్ని స్వాధీనం చేసుకుంది. 1948 మధ్యకల్లా చియాంగ్‌కు అమెరికన్ సహాయం ఆగిపోయింది.

1949 నూతనసంవత్సర దినానికి షియాంగ్ యుద్ధం అంతంచేసే సంధిపలుకులు పలకసాగాడు. అయితే మావో 'అందరు యుద్ధ నేరస్థులకు కఠినశిక్షే' అని గట్టి పట్టుపట్టాడు. చియాంగ్‌నూ యుద్ధనేరస్థుడే అని తేల్చిపారేశాడు మావో. ఎన్నికలు జరుపుదాం, కలిసి ప్రభుత్వం ఏర్పరుద్దాం అన్నాడు చియాంగ్. "చియాంగ్ ప్రణాళిక సమాజ వ్యతిరేకం, నీచం అని కొట్టిపారేశాడు మావో. 1,2,3,4,5 ఫీల్డు, సైనిక దళాలు (PLA), ఎర్రసైన్యంగా మిగిలివున్నదళాలు సమైక్యంగా నాన్‌కింగ్ మీద (చియాంగ్ కేంద్ర స్థానం) విరుచుకపడ్డాయి, చియాంగ్ తన యంత్రాంగంతో మొదట కాన్‌టన్ (4/49)కు పారిపోయి ఎర్రసైన్యాలు తరమగా తైపెయ్ తైవాన్‌కు 1-8-49 నాడు పారిపోయాడు.

చియాంగ్ కైషేక్ తన పరివారంతో 300 మిలియన్ల అమెరికన్ డాలర్లతో, 5 లక్షల సైనికబలంతో, లెక్కలేనంత కళాఖండాలతో, కొందరు నేతలతో (ఫార్మోసా) తైవాన్‌కువెళ్ళి స్థిరపడిపోయాడు.

అది అక్టోబరు 1,1949. బైజింగ్! స్వర్గ తుల్యమైన శాంతికి మార్గం (Gate of Havenly peace)

మావో, మరి 12 మంది షాంఘైలో కలిసి రహస్యంగా ఓ పార్టీ స్థాపించిన 28 సంవత్సరాల తర్వాత!

ద్వారంపైన్నుంచి మావో చైనాను ప్రజారిపబ్లిక్‌గా ప్రకటించాడు, ఆనందమే ఆనందం! చప్పట్లహోరు.

కమూనిస్టుల పాలన ప్రారంభం చైనాలో!
ప్రజల హృదయాల్లో ఉద్వేగం, సరికొత్త ఆశలు.
కానీ శాంతి నెలకొన్నదా? ప్రజల కష్టాలు కడతేరాయా?
ప్రజల కోరిక ప్రకారం భద్రత ఏర్పడ్డదా?
కమ్యూనిస్టులు వర్గ నిర్మూలనం చేశారా?
ప్రజాసేవకులుగానే నిల్చిపొయ్యారా?
వాగ్దానం చేసిన సోషలిజాన్ని అందించారా??

## 4. విప్లవాలు, వైపరీత్యాలు

కమ్యూనిస్టు ప్రభుత్వం ఏర్పడినా శాంతిలేదు చైనాలో. వార్‌లార్డ్సు, రాచరికాలు, విదేశీయుడు, కమ్యూనిస్టు ఉద్యమాలు ఇలా ఎన్నింటి వల్లనో పీల్చి పిప్పిచెయ్యబడ్డ చైనా ప్రజ 1949 తర్వాత కొత్త సమస్యల్ని ఎదుర్కోవలసివచ్చింది. అధికారంలోకి రానప్పటి కమ్యూనిస్టుకు, అధికారంలోవున్న కమ్యూనిస్టుకు చాలా తేడా కనిపించింది.

1936 దాకా దాదాపుగా మామూలు కార్యకర్తగా వున్న మావో చైనా నేత అయిపోయి తన పేరుమీద కొత్త 'యిజాన్ని' పెంచసాగాడు. సహజంగానే కొత్త వర్గమొకటి అతనికి సవాలై కూర్చుంది. వాళ్ళను తొలగించే ఉద్యమం (Parges) ఓవైపు.

పాత సమాజాన్ని నేలరాచి కొత్త పద్ధతిలో కమ్యూన్ల స్థాపన, బ్రహ్మాండమైన ముందడుగు (greet leap forward), సాంస్కృతిక విప్లవం పేరుమీద వ్యతిరేకుల నేరివేయటం (cultural revolution), అధికార పోరాటాలు ఇలా చైనా సమాజాన్ని శాంతిగా బ్రతకనివ్వలేదు మావో యుగం.

మావో తెలివిగలవాడే! అందరిపై వ్యాఖ్యానాలు చేసేవాడు. 'చౌకు విశ్రాంతి ఎక్కువ కావాలి, టెంగ్(డెంగ్)కు పని ఎక్కువ కావాలి, వాంగ్‌కు చదువు కావాలి, చియాన్ తక్కువ మాట్లాడుతాడు, మూడు ఎక్కువలు, ఒక తక్కువ'.

'తెరుచుకుని వుండటానికే చెవులున్నాయి, నోరు మూసుకుని వుండొచ్చు'.

ఇలాటి సువాక్కులు అతని ధోరణిని తెల్పుతాయి.

మావో చైనావదలి ఏ విదేశాలకు వెళ్ళలేదు 1949 ఆఖరులో ఒక్కసారి మాత్రం మాస్కో వెళ్ళాడు. రష్యా-చైనా స్నేహ సంబంధాల వప్పందం (1950) మీద స్టాలిన్‌తో చర్చలు జరిపిన సందర్భం అది.

1950 - 60 ప్రాంతాల్లో చైనాలో జరిగిన విషయాల గురించి ఏ విశ్లేషణ చెయ్యాలన్నా నమ్మకమైన సమాచారం దొరకదు. వివిధ ప్రపంచ పత్రికల్లో ప్రచురించిన విషయాల్లో నిజం ఎంతో తెలీదు. అధికార ప్రకటనలు, వివరించిన సమాచారం ఒకటైతే హాంగ్‌కాంగ్ ద్వారా చైనా ప్రజలు అందజేసే సమాచారం మరోటుంటుంది.

అయితే 1956 దాకా మార్క్సిజం-లెనినిజం, మావో ఆలోచనలు, ప్రతి కమ్యూనిస్టు పార్టీ సభ్యుడూ నిర్వహించాల్సిన బాధ్యతలు, విమర్శ, ఆత్మ విమర్శ, ప్రజలతో సన్నిహిత సంబంధాలు; ఖండనలు, ఆత్మ ఖండనము, బహిష్కరణలు, సంస్కరణలు ఈ శబ్దాలతో చైనా నిండి పోయింది.

అధికారంలోకి రాగానే ప్రజల్ని తమ తమ కుటుంబ చరిత్రల గురించి నివేదికలు సమర్పించుకోమన్నారు కమ్యూనిస్టులు. అంతే కొద్ది నెలల్లోనే వేలాది మంది జైళ్ళపాలయ్యారు.

ప్రజల్ని పోలీసులు ఠాణాలకు పిలిచేవారు. 'కొత్త ప్రభుత్వం గురించి నీ ఆలోచన ఏమిటి?' అని అడిగేవారు. ఏమాత్రం అసంతృప్తి వ్యక్తం చేసినా ఇహ వాళ్ళింటికి పోరు పునః సంస్కారాల పేరుతో తీసికెళ్ళినవారి గతి మరి తెలీదు.

23-7-1950 లో అమలుకు తెచ్చిన చట్టం ప్రకారం ప్రజా స్వామ్యం(?)ను (Peoples Democracy) వ్యతిరేకించిన వారు తీవ్ర శిక్షలు అనుభవించాల్సిందే.

21-2-1951 లో అమలు పరిచిన చట్టం ప్రకారం 21 రకాల నేరాలకు మరణశిక్ష పడుతుంది. పాలనా వ్యవస్థకు వ్యతిరేకుల్ని గుర్తించటానికి, పరస్పర గూఢచారత్వం ప్రోత్సహించబడ్డది. ఎవడు సిఐడి పనిచేస్తున్నాడో తెలీదు. కుటుంబ వ్యవస్థ నాశనం చెయ్యటానికి కుటుంబ సభ్యుల్లోనే ఒకరి మీద ఒకరిని చారులుగా నియమించటం జరిగింది. కమ్యూనిజానికి వ్యతిరేకంగా మాట్లాడితే తండ్రిని కొడుకు, భార్యను భర్త బహిరంగంగా నిరసించేవారు. యువతీ యువకులు తలిదండ్రుల్ని 'విప్లవ వ్యతిరేకులు' అని విమర్శించి జైళ్ళకు పంపారు. కొత్త సంస్కృతి ఏర్పడింది చైనాలో.

మనస్సు విప్పి మాట్లాడే స్వేచ్ఛ పోయింది. ఎప్పుడు, ఎవడు, ఎక్కడ ఎవడికొంప ముంచుతాడో తెలీదు!

పార్టీ కార్యకర్తలు రైతులు అందించాల్సిన ధాన్యం కోటాలు నిర్ణయించారు. అవి ఏటేటా పెరిగాయి. స్వంత వినియోగానికి ఫలసాయం మిగిలేదికాదు. రైతులు ఆకాలితో పస్తులుండేస్థితి ఏర్పడింది.

ప్రజల్ని కమ్యూన్ల వ్యవస్థలో పునర్వ్యవస్థీకరించటమే మార్గమని మావో నిర్ణయించాడు. సాంప్రదాయ కుటుంబ వ్యవస్థ తొలగించి ఈ

కమ్యూన్ వ్యవస్థ స్థాపించారు. ఇదే సోషలిజానికి మార్గం అన్నారు. రష్యా కూడా అమలుపరచని మార్పుఇది. లెనిన్, స్టాలిన్‌లను మించిన కమ్యూనిస్టునని నిరూపించు కోవాలని చూచాడు కాబోలుమావో!

1958 కల్లా కమ్యూన్లు ఎన్నోచోట్ల అమలులోకి వచ్చాయి. కమ్యూన్లలో చేరని వారిని ఆదర్శానికి శత్రువులన్నారు. భోజనాలు, పడక, పని, అన్నీ కమ్యూన్లలోనే.

విమర్శించినవాళ్ళ మీద సి. సి. పి. (చైనా కమ్యూనిస్టు పార్టీ) ని బలహీనం చేసేవాళ్ళు అని అభియోగంతేబడ్డది.

కమ్యూన్ల గురించి, కమ్యూనిజం గురించి అనుకూలంగా మాట్లాడే వారికి ప్రోత్సాహం లభించింది. పార్టీకి అనుకూలంగా లేనివారి మీద ధ్వజాలు లేచాయి. స్వేచ్ఛగా మాట్లడి కొత్త పద్ధతుల్ని విమర్శించిన కమ్యూనిస్టుల్ని కూడాతిట్టారు, పార్టీ నుంచి తొలగించారు, కొన్నాళ్ళు పరిశీలనలో వుంచారు. వేలాదిమంది బహిష్కరించబడ్డారు.

వేలాది మందిని క్రిందికి పంపారు (హ్సియా ఫాంగ్). అంటే గ్రామాలకు పంపేసేవారు. మేధావులు, పార్టీవారు, విద్యాధికులు కూడా ఇలా కుగ్రామాలకు పంపబడ్డారు. ఒక్క 1957-58 సంవత్సరంలోనే 13 లక్షల మంది కఠిన పరిశ్రమకుగాను గ్రామాలకు పంపబడ్డారు 1965 దాకా నాలుగు కోట్లమంది విద్యార్థుల్ని పొలంపనికి పంపటం జరిగింది. ఈ సంఖ్య 1965-69ల మధ్య కోటి అని అంచనా. వీళ్ళు బురదలో దుక్కిచెయ్యాలి, నాట్లు వెయ్యాలి, నూర్పులు చెయ్యాలి, జలగలు పీకాయి, మలేరియా, సన్నిపాతం, సంధి జ్వరాలొచ్చాయి. వేలాది మంది చనిపోయ్యారు.

తొలిరోజుల్లో 24,000 పెద్ద కమ్యూన్లు, 74000 చిన్న కమ్యూన్లు ఏర్పడ్డాయి.

ఇవంతా అతి గొప్ప పురోగమనంలో భాగమే! (The Great Leap forward)

కమ్యూన్లతోబాటు దొడ్లల్లో వుండే చిన్న చిన్న ఉక్కు కర్మాగారాలు, సంపూర్ణం సమన్వయ కమ్యూన్లు ఇవీ మావో ప్రణాళికలు. పాఠశాలలు, కళాశాలలు మూసేయించి పిల్లల్ని కూడా కమ్యూన్లపనికి తోలేశారు.

మావోదృక్పథంలో చైనా చాలా శక్తివంతమైన సమృద్ధమైన ధనిక దేశం. పెద్దరాబడి, విలాసవస్తువులున్నది కాకపోయినా ఫర్లేదు. విలాసాలతో నిండిన ఉన్నత స్థాయి జీవితం మనుషుల్ని బద్ధకస్తుల్ని చేస్తుంది. విప్లవ మార్గంనుంచి తొలగించేస్తుంది. మావో ఆలోచనను కాదనే దమ్ము లెవరికి?

గతంలో తన గెరిల్లాలు, ఎర్రసైన్యం తమ స్వప్రయోజనాల్ని త్యాగం చేసి, ప్రతిఫలం లేకుండా, కోరను కూడా కోరకుండా పని చేశారు. అలానే రైతులు, ఇతర ప్రజలు కూడా తమ శక్తినంతా ధార పోసి ప్రతిఫలాపేక్ష లేకుండా పని చేసేలా చూడాలి. పార్టీ కార్యకర్తలు పాతయేనాన్ రోజుల్లోలా అందరి చేత పని చేయించాలి. మావోసూక్తులు ఇదివరకటి కార్యకర్తలను ప్రభావితం చేసినట్లు వీళ్ళనూ స్ఫూర్తిలో నింపేస్తాయి. ఈ ఊహల్లో విహరించాడు మావో.

మొత్తం గ్రామీణ ప్రాంతాల్ని ఓ పెద్ద కమ్యూనుగా రూపాంతరం చెయ్యాలని అతని ఆలోచన. అన్ని కమ్యూన్లూ స్వయం సమృద్ధమై, ఆర్థికంగా, రాజకీయంగా, సాంస్కృతికంగా, ఆఖరుకు సైనిక పరంగాకూడా ఎవరి సహాయ సహకారాలూ లేకుండా వుండాలి. ఈ కేంద్రాలన్నింటినీ కలిసి కమ్యూనిస్టు పార్టీ మార్గదర్శనం చేస్తుంది.

కానీ 5 సంవత్సరాల్లో కమ్యూన్ల పద్ధతి ఘోరంగా విఫలమైంది. ఆహార పరిస్థితి దిగజారింది. మనుషులకు మనస్సులుంటాయని మర్చిపోయింది కమ్యూనిజం. మనుషులు యంత్రాలు కాదు. ఆలోచనలు, ఆశలు, పరస్పర ప్రేమాభిమానులు వుండే వ్యక్తులు. నీదేంలేదు. ఆఖరుకు పెళ్ళాం కూడ కమ్యూన్ ఆస్తే అంటే ఎలా! కమ్యూనిజాన్ని ఓ తన్ను తంతాడు ఎంత వెధవైనా. ఏ కమ్యూను కాకమ్యూను. ప్రభుత్వానికి ఇంత పంట ఇవ్వాలి తప్పదు. నువ్వెంతైనా పండించు నీదనేంలేదు. పంట ఎంత అయినా రేషన్లోనే అన్ని లెక్క ప్రకారం అందుతాయి. దిగుబడి పడిపోయింది. బియ్యం లేవు, నూనెలేదు, గ్రామాల్లో ఉప్పూలేదు.

రేషన్లు విపరీతంగా కోతబడ్డాయి. నెలకు తలకు 8 పౌన్లు (4కిలోలు). ప్రజలు చెట్ల బెరళ్ళ మీదా, అడవిలో దుంపలమీద ఎగబడ్డారు. 1959 ఆఖరుకల్లా జనానికి పూకియాంగ్‌లో కాబేజీ తప్ప మరేంలేదు తినటానికి. నాన్‌కింగ్‌లో కారెట్లు, ముల్లంగి మౌలికాహారం అయింది. లెక్కలేనంత మంది రైతులు, కార్మికులు ఆకలికి తట్టుకోలేక, నేలకొరిగి పోయారు. ఎక్కడికక్కడ మూకుమ్మడి ఖననాలు చెయ్యాల్సి వచ్చింది జనానికి.

తిండి కోటాలు పెంచమని ప్రజలు ఆందోళన చెయ్యసాగారు. కమ్యూన్లవల్ల ప్రయోజనం ఏమిటి?

తమ పొలాలు, తమ కష్టంకాని తిండిగింజలు లేవు, కూరల్లేవు.

కమ్యూనిజం బీదలకోసం కాదా?

ఈ కమ్యూనిజం ఏ రకం నరకంరా బాబూ!

బలవంతంగా మరింత కష్టించి పనిచెయ్యాలి. పనికి జనాన్ని బలవంతంగా ఎక్కడెక్కడికో పంపుతారు. కన్ను, అంద్వేయ్‌లాటి మారు

మూల ప్రదేశాలకు బలవంతపు 'కూలీ'లుగా పంపినవాళ్ళు ఈగల్లా మలమల మాడిచచ్చారు. మందుల్లేవు. కిడ్నీ జబ్బుల్తో కొందరు చచ్చారు.

మావో స్థితి గందరగోళంలో పడింది. కుర్చీ కదలసాగింది. తప్పుల్ని మరొకరి మీదికి నెట్టటానికి మరో విప్లవం కావలసివచ్చింది. విమర్శించిన వాళ్ళను పెట్టుబడిదారీ తొత్తులన్నారు (Capitalist roaders). కంపుకొట్టే మేధావులన్నారు. వితండవాదులన్నారు. వీళ్ళను సంస్కరించాలన్నారు. సాంస్కృతిక విప్లవానికి నాందీవాక్యాలివి!

అధికారానికి పోరాటం మొదలైంది. పార్టీలో మావో అధికారాలు తొలగసాగాయి. లియుషావోచీ, డెంగ్ జియావో పింగ్, లిన్‌పి యావోలు అధికారాల్ని హస్తగతం చేసుకోసాగారు. లిన్‌పియావో పైకెత్తబడ్డాడు.

1966! చైనా లావాలా ఉడికిపోసాగింది. మావో ప్రజల్ని ఊపెయ్యగలడు. మావో సూక్తులు పెరిగాయి. ఉపన్యాసాలు ప్రజల్లో ప్రచారం కాసాగాయి. చైనా రక్షణకు (!) కొత్త శక్తిని సృష్టించాడు మావో. అదే ఎర్ర రక్షకులు అందరికి తెలిసిన పేరు రెడ్‌గార్డ్స్!

రెడ్‌గార్డ్ శక్తి అధికార పోటీలో కీలకమైంది.

లక్షలాది యువకులు, లేత వయస్సులోవున్న పసివాళ్ళు 'చైనా సమాజ ఆత్మరక్షణకు' రంగంలోకి దిగసాగారు. చైనా సాంస్కృతిక పరంపర రక్షించబడాలి. పాశ్చాత్య బూర్జువా సంస్కృతిని నేలరాయాలి, అధునాతనంగా వుండే క్రాపుల దగ్గర్నుంచి, రష్యావారి బాచ్ (Bach) సాహిత్యందాకా నిర్మూలించాలి, తగలబెట్టాలి. కదలండి! కదలండి! విజృంభించి కదంతొక్కండి'. పిచ్చి ఆవేశంతో మావో మేధావితనం మాత్రమే ఆధారంగా అశేష యువవాహిని కదిలింది.

చైనా చరిత్ర పుటల్లో కొత్త అధ్యాయం అది. మావో వ్యతిరేకుల క్షాళన, చైనాకు కొత్త ఊపిరి. అసలు కథ అధికారానికి అఖండపోరాటం.

ఆగస్టు, 18, 1966!

టియానన్‌మెన్ కూడలిలో లక్షలాది ప్రజానీకం ముందు వేదిక మీద మావో, లిన్ పియావో, చౌయన్‌లై, జియాంగ్ క్వింగ్ (మావో మూడో భార్య) పరివేష్టితులయ్యారు, మావో ప్రతి మాటకూ జనం ఊగిపోయారు. చైనా అన్ని దిక్కుల్లో యువత రెడ్‌గార్డ్స్‌గా రూపాంతరం చెంది చైనాక్షాళన మొదలెట్టారు.

లక్షల మందిని విచారణ లేకుండా కట్టికొట్టి జైళ్ళల్లో పారేశారు. వేలమంది పార్టీ కార్యకర్తలు మాడిపోయారు. రెడ్ గార్డ్స్‌కు అడ్డూ అపూ లేదు. శిక్షలు అతితీవ్రమైనవి. యుద్ధం రోజుల్లో కీలకపాత్ర వహించిన వాళ్ళను కూడా వదల్లేదు రెడ్‌గార్డ్స్. రోగగ్రస్తులైన వృద్ధ నేతలను కూడా జైల్లోపారేశారు. వాళ్ళశవాలే బయట కొచ్చాయి.

రెడ్‌గార్డ్స్ తమ ఆచార్యుల్నే కొట్టారు. దినాలకొద్దీ వాళ్ళ చేతులు కొయ్యలకు కట్టేసి వేలాడదీసి వుంచారు. వాళ్ళను, గుద్దారు; కర్రలతో, ఇనప ఊచలతో కొట్టారు. మేధావులైనా, డాక్టర్లయినా, ఇంజనీర్లయినా, ఎవరైనా సరే గొణిగితే చాలు బురద పొలాల్లోకి తోసి చావగొట్టి దుక్కిదున్నించారు. సైనిక శిక్షణ - పరిశోధనా శాలలు తప్ప అన్ని విశ్వవిద్యాలయాలూ కొన్ని 3, కొన్ని 5, మరికొన్ని 10 సంవత్సరాలూ మూతబడ్డాయి.

విప్లవం పతాకస్థాయికి చేరేసరికి రెడ్‌గార్డ్స్ మధ్యనే కొట్లాటలు పెరిగాయి. చోంగ్ కింగ్, పెకింగ్ (బీజింగ్), హార్బిన్, ఊహాన్లల్లో యుద్ధాలే జరిగాయి.

చావులకు ఏలెక్కలేదు చైనాలో ఆ రోజుల్లో.

అధికారం చేజిక్కించుకున్న 1949 నుంచే కమ్యూనిజం విప్లవం పేర ఊచకోత సాగుతూనేవుంది. నేషనలిస్టులు, రివిజనిస్టులు, కాపిట లిస్టులు, మరోరకం వర్గశత్రువులు, ఆఖరుకు కమ్యూనిస్టులే ఊచకోత కొయ్యబడ్డారు.

1951 లో తొలి ఆరు నెలల్లో P L A (ప్రజా విముక్తసైన్యం) ఒక్క క్వాంగ్‌టుంగ్ క్వాంగ్సీ ప్రాంతాల్లోనే 2,60,000 మంది ఆత్మలకు విముక్తి కలిగించారు.

అదే కాలంలో మధ్య చైనా, దక్షిణ ప్రాంతాల్లో 10,60,000 ల మంది నిహతులయ్యారు.

1952 మధ్యకల్లా మొత్తం హత్యలు 20 లక్షలు!

మార్క్ టెన్నియన్ అనే మతాచార్యుడు చైనాలో 23 సంవత్స రాలు నివసించాడు. అతని అంచనా ప్రకారం కమ్యూనిజం చేతుల్లోని చావులు 70 లక్షలు, జైళ్ళల్లో పారేసిన వారి లెక్క 2 కోట్లు.

కేవలం సాంస్కృతిక విప్లవం చావులు థియోడర్ వైట్ అనే పాశ్చాత్యుడి అంచనా ప్రకారం 34,000. అనవసర నిరాధార అబండా లతో శిక్షలుపడ్డ వారి సంఖ్య 7,29,511. వీటికి రికార్డు లున్నాయి. దొమ్మీల్లో చావులు; ప్రేక్షకులు, నాగరికులు బాంబులు, గుండ్లు తగిలి చచ్చిన వారి లెక్క; రాళ్ళతో, ఇనప ఊచలతో, కర్రల్తో కొట్టగా చచ్చిన వారు; కర్రలకు వేలాడదీసి అలానే వదిలెయ్యగా చచ్చినవాళ్ళు పై లెక్క ల్లోకిరారు. వాళ్ళెందరో, ఎక్కడెక్కడ చచ్చారో ఎవడికి తెలుసు! కావా లనే ఎలాటి లెక్కలు ఉంచలేదు. విచారణలో క్రూరత్వం వల్ల చచ్చిన వారి లెక్క తెలీదు. ఓ చైనా విద్యావంతుడి అంచనా ప్రకారం చావుల సంఖ్య 4 కోట్లు! (అయినా చైనా జనాభా పెద్దదే సుమా!).

సాంస్కృతిక విప్లవం ఊపులో అధికారాన్ని చలాయించిన వాళ్ళు నలుగురు. జియాంగ్ క్వింగ్ (మావో భార్య), ఝూంగ్ చున్‌కియావో యావో వెన్‌యుయాన్, వాంగ్‌హోంగ్ వెన్. వీళ్ళనే తర్వాత దుష్ట చతుష్టయం అన్నారు. మావో మరణం తర్వాత వీళ్ళను జైల్లో పారెయ్యటం జరిగింది. వాళ్ళు బ్రతికేవున్నారో లేదో తెలీదు.

సాంస్కృతిక విప్లవం తర్వాత కోటిమంది విద్యార్థుల్ని కొండల దగ్గరకు (up to the hills) గ్రామాలకు (Down to the villages) పంపేశారు నేతలు. వాళ్ళ ఇష్టానుసారం గాదు. ఎదురు మాట్లాడలేని వ్యవస్థలో ఆ కుర్రకుంకలు చచ్చినట్లు వెళ్ళిపొయ్యారు. భవిష్యత్తు అంధకారం కాగా వాళ్ళు రైతులుగా మారిపొయ్యారు. ఇవి వాళ్ళ జీవితాలంతే! మళ్ళీ పట్నాలకు రావటం, కాలేజీల్లో చదవటం అన్న ప్రశ్నే లేదు. ఈ ప్రజామోదంలేని ప్రణాళిక వల్ల వేలాది యువతీ యువకులు ప్రతి ఏడూ రహస్యంగా, చావుకు్కడా తెగించి, హాంగ్‌కాంగ్ పారిపోతున్నారు మరో భవిష్యత్తును వెదుక్కుంటూ.

ఆరోగ్యం క్షీణించే మావో దుష్ట చతుష్టయానికి ఊపిరిపోసి మరిన్ని కష్టాలు తెచ్చాడు చైనా ప్రజలకు. ఈ వంశ పారంపర్య అధికారం కమ్యూనిజంలో కూడా తప్పలేదు.

1971 తర్వాత లిన్‌పియావో అధికారం కోసం పాకులాడాడు. లిన్‌పియావోకు అన్ని దారులూ మూతపడగా విమానంలో పారిపోతూ ఆ విమానం పేలి (!) అంతమయ్యాడు.

డెంగ్‌ను కాపిటలిస్టుల తొత్తు అని నిరసించి పదవీచ్యుతుడ్ని చేశారు. బహిరంగంగా దుమ్మె దులిపేశారు.

అలా ముగిసింది సాంస్కృతిక విప్లవం.

ఆరోగ్యం క్షీణించి క్షీణించి 9-9-1976 న ప్రభాత సమయాన మావో మరణించాడు.

'కమ్యూనిస్టు వాతావరణంలో, సోషలిజం ఛాయలో అధికారం కోసం పోరాటం అన్నదే వుండదు' అన్నది మనకు చెప్పబడే విషయం.

కాని చైనా అలా నిరూపించలేదు.

మావో మూడో భార్య, 64 సంవత్సరాల జియాంగ్ క్వింగ్; మావో ప్రాపకంతో పెద్ద అధికారంలోకి వచ్చిన నేత మిల్లు ఉద్యోగి వాంగ్ హాంగ్ వెన్ (39 సం.); మావో బంధువు యావోలెన్ యుయాన్ (45 సం.); మావో సన్నిహిత విలేఖరి ఝూంగ్‌చున్ కియావోలు అధికారాన్ని హస్తగతం చేసుకున్నారు.

'నీవు అధికారంలో వుంటే నాకే దిగులూ వుండదు' అని మావో వ్రాసిన కాగితాన్ని జియాంగ్ క్వింగ్ విడుదల చేసింది.

అక్టోబరు, 6, 1976 న పార్టి మహాసభ జరిపారు. జియాంగ్ పార్టీ చైర్మన్‌గా, ఝూంగ్‌చున్ కియావో ప్రధానిగా, వాంగ్ హాంగ్‌వెన్ జాతీయ పార్టీ కాంగ్రెస్ నేతగా ప్రతిపాదన చెయ్యటం జరిగింది.

పార్టీ మీటింగు జరిగే ముందు రోజు రాత్రి హువా కారు మీద కాల్పులు జరిగాయి. మావో మేనల్లుడు, మరో ఇద్దరు వామ పక్షీయులు హత్య చెయ్యబడ్డారు. వాంగ్ హాంగ్‌వెన్‌కు గాయాలు. అంటే రెండు వైపుల వారూ అధికారంకోసం పోరాటం జరిపారు. దాదాపు 30 సంవత్సరాల కమ్యూనిస్టు దేశంలో అధికారం కోసం జరిగిన పోరాటా లివి!

ఆ రాత్రి రాజ్యాంగం లేదు. చట్టం లేదు. అధికారులు లేరు. వార్తలు లేవు. చైనా లేదు. కేవలం బలప్రయోగం వుంది. హువా వర్గం గెలిచింది.

ఇహ అన్ని పత్రికల్లో చతుష్టయం మీద దుమ్మెత్తిపోస్తూ వ్యాసాలు వచ్చాయి. వాళ్ళను పంటలు తినేసే కీటకాల్లా కార్టూన్లు గీశారు.

చతుష్టయం జైలుపాలైంది.

ఆ తర్వాత బహిష్కరణల అధ్యాయం పునరావృతమైంది. లక్ష మంది బహిష్కరణలకు బలైనట్లు ఓ హాంగ్‌కాంగ్ వార్త. 1976 చైనాలో భయంకర సంవత్సరం. చౌయన్‌లై (8-1-76), మావో (9-9-76) ల మరణాలు, దుష్ట చతుష్టయ ఘోరాలు 1976లోనే.

కమ్యూనిజంలో ప్రజలకు మిగిలిన శాంతి ఇది. స్వేచ్ఛగా అభిప్రాయాల్ని వ్యక్తం చేసే వ్యవస్థ ఏనాడో పోగొట్టుకున్న చైనా ప్రజ ఏ వైపు ఆశతో చూడాలో తెలీని అయోమయంలో పడ్డారు.

1967లో 'పెట్టుబడిదారీల తొత్తు' అని బహిష్కరించబడ్డ డెంగ్ 1973నుంచి నిలదొక్కుకుని చైనా కమ్యూనిస్టు పార్టీ ఛైర్మన్ అయ్యాడు. అతనివైపు ఆశగా చూడసాగింది చైనా ప్రజ.

## 5. ఆర్థిక వైఫల్యం

కమ్యూన్ల వ్యవస్థ చైనాకు శాపం అనాలి. భూమి కమ్యూన్లదైనందువల్ల తమదన్న భావం పోయింది రైతుల్లో. నిర్ణయించిన నిష్పత్తిలో పంటను ప్రభుత్వం చెప్పిన ధరకు అమ్మాలి. సాంస్కృతిక విప్లవం రోజుల్లో ఆర్థిక ప్రతిష్టంభన ఏర్పడింది. వ్యవసాయ ఉత్పత్తి పడిపోయింది. చియాంగ్‌కై షేక్ పాలనలో ఏర్పడ్డ ఆర్థిక స్తంభన, లంచగొండితనం, దుర్భర ప్రజా జీవితం, అవమాన భారం తొలగించి చైనా ప్రజకు కొత్త జీవితాల్ని ప్రసాదిస్తానని కమ్యూనిస్టు ప్రభుత్వాన్ని ఏర్పరిచాడు మావో. కానీ పాతికేళ్ళ కమ్యూనిస్టు పాలనలో కొత్త కొత్త భయోత్పాతాల్ని చూట్టమేగాని మరే ఆశలూ మిగల్లేదు చైనా ప్రజల్లో.

కొత్త వ్యవస్థలో పంపిణీ సమస్యలు, ప్రభుత్వ ఆధిపత్యం వల్ల అసంతృప్తి పెరిగాయి. దిగుబడి పడిపోగా ఆహార సమస్యలూ తలెత్తాయి. ఒక్క గై ఝోవ్ ప్రాంతంలోనే 3 కోట్ల మంది ప్రజలకు సరైన తిండి, బట్ట లేదని అంచనా. చైనాలో ద్రవ్యోల్బణం 7.5 నుంచి 20 శాతం వరకు రాజ్యం ఏలసాగింది 1988, జులైలో గ్జిన్‌హువా నివేదిక ప్రకారం చైనాలో వందకోట్ల ప్రజా ఇతర దేశాలకు తలకో 30 డాలర్ల అప్పులో పడిపోయారు (విదేశీ అప్పు).

భూమి, పరిశ్రమలు అన్నీ రాష్ట్రానివే అయ్యాయి కమ్యూనిజం వచ్చాక. భూమి పట్ల ఎవరికీ బాధ్యత లేనట్లే. పరిశ్రమల పట్లా ఎవడికీ బాధ్యతలేదు.

తన ఆఖరి రోజుల్లో మావో చైనాకు గుదిబండలా తయారయ్యాడు. మావో పాలనలో ఎగుడుదిగుళ్ళు లేవు. ఒక్క దిగుడే. డెంగ్ స్వయాన ప్రకటించినట్లు "1958 లోని గొప్ప ముందడుగు (Great leap forward) పర్యవసానం ఛండాలం. 1966-76ల మధ్య తెచ్చిపెట్టిన సాంస్కృతిక విప్లవం అంతకంటే అధ్వాన్నం. 1957 నుంచి 1978 వరకు చైనా వామపక్ష సిద్ధాంతాలతో పీడించబడింది తత్ఫలితంగా 20 సంవత్స రాలు వ్యుత్పత్తి శక్తులు స్తంభించిపోయాయి. సోషలిజం అంటే దరిద్రాన్ని పంచిపెట్టడం కాదు. వ్యుత్పత్తి పెరక్క, ప్రజల జీవన స్థాయి పెంచక సోషలిజాన్ని నిర్మిస్తున్నామనటం అవివేకం (!)".

అదే జరిగింది కమ్యూనిస్టు చైనాలో.

1979కి పూర్వపు కాలంలో ఆహార ధాన్యాల పంటల్ని పెంచటం తప్ప ఇతర రాబడి పెంచే పంటల్ని పెంచలేదు చైనాలో. అటవీ అభి

వృద్ధి, పశు సంపద పెంపు, మత్స్య పరిశ్రమ, అలా ఇతర అనుబంధ కార్యక్రమాలు లేవు. గ్రామీణ పశువుల పెంపకం, పందుల పెంపకం లాటి వాటిని కమ్యూన్ సభ్యులు చెయ్యటానికి వీల్లేదన్నారు. తమది అని ఓ కోడిని పెంచుకున్నా కాపిటలిస్టు అని తెగనాడారు.

గ్రామీణ ఆర్థిక విస్తృత కూడా 'కాపిటలిజం' అయింది. దేశం మూలస్థానం (Grass roots) నుంచి ఆర్థిక పెరుగుదల కాదు దరిద్రం పెరిగింది.

ఇదీ కమ్యూనిజం చైనాకు అందించిన ఆశీర్వాదం.

పాలనలు చేపట్టిన డెంగ్ కొన్ని సంస్కరణల్ని ప్రవేశపెట్టాడు.

—కమ్యూన్ సభ్యులకు సామూహికంగా అందించిన భూమిని వాళ్ళ స్వంత ఉపయోగానికి అనుమతించటం.

—ఇళ్ళల్లో పందులు, గొర్రెలు, మేకలు, పశువులు, కుందేళ్ళు, గాడిదలు, కోళ్ళు, బాతులు ఇతర జీవాల్ని పెంచుకోవటానికి అనుమతి (ఇదివరకు ఇవి పెంచరాదు! సోషలిజానికి అడ్డుకాబోలు!)

—నేత, కుట్టు, పండ్ల సేకరణ, మత్స్య పరిశ్రమ, వేట, వృక్షాల పెంపకం, తేనెటీగల పరిశ్రమలు ఇష్టమున్న వారు చేబట్టవచ్చు.

—పండ్లతోటల పెంపకం, కలప పరిశ్రమ, వెదుళ్ళను ఇళ్ళ చుట్టూ వేసుకోవటం

ఈ సాధారణ విషయాలు కూడా ప్రజలకు అందుబాటులో లేకుండా నిషేధించబడ్డాయి కమ్యూనిజంలో!

మనిషిని బందీచేసి మృగాన్నిగా, తప్పితే బానిసగా చేసినవ్యవస్థ ఉన్నదని అంగీకరించినట్లే.

వీటితోబాటు గ్రామీణ మార్కెట్లకు అనుమతి ఇవ్వబడ్డది 30 సంవత్సరాల పాలన తర్వాత. ఇవన్నీ ఒకప్పుడు 'కాపిటలిజం తోకలు' అని నిరసించి ధ్వంసంచేయ్యబడ్డ వ్యవస్థలు.

క్రమంగా వైయక్తికంగా వ్యాపారం చేసుకోటానికి అనుమతించారు చైనాలో.

అప్పటి దాకా అణిచివెయ్యబడివున్న అశాంతిపైకి ప్రస్ఫుటంగా కనిపించసాగింది.

కమ్యూనిస్టు వ్యవస్థలో స్వంత సంసారాలు కూడా లేకుండా కమ్యూన్లలో శారీరక అవసరాల్ని తీర్చుకోవలసిన అవస్థపడ్డ చైనా ప్రజలు స్వేచ్ఛ కోసం అలమటించసాగారు.

## 6. చైనాకు ప్రజాస్వామ్యం

కమ్యూనిజం జలుబు వదిలిన చైనా ప్రజ స్వేచ్ఛకోసం, మార్పుల కోసం అలమటించసాగింది.

పెరిగే అసంతృప్తి మొదట పారిశ్రామిక ఆందోళనతో బయట పడింది.

'చైనా సామాజిక, పారిశ్రామిక పోరాటాలతో వీగిపోతుంది' అని ఆగస్టు, 1988 లో హాంగ్‌కాంగ్ నుంచి లారీజగన్ నివేదిక పంపాడు.

బయటి ప్రపంచానికి అంతగా తెలీని ఆందోళనలు పెకింగ్‌లో ఎదురుబదురుగా కనిపించిన విద్యార్థి ఆందోళనలు. టిబెట్‌లో అశాంతి

హైనాన్ దీవిలో వీధిపోరాటాలు, పెకింగ్ ఎల్లల్లో రైతుల ప్రదర్శనలు, సిచుయాన్‌లో ఫుట్‌బాల్ ఆట తగాదా పేరిట చెలరేగిన దొమ్మీ, గుఆంగ్ ఝుష్‌లో బాంకుమీద జరిగిన దొమ్మీ, ఎన్నో పట్నాల్లో ఆహార వస్తువుల రహస్యపు నిలవలు ఇవన్నీ చైనా వాతావరణాన్ని తెల్పే కొన్ని ఉదాహరణలు మాత్రమే.

1988 లో చైనా వ్యాపార అనుబంధ యూనియన్ ఉద్యమ డిప్యూటీ డైరెక్టర్ చెన్‌జీ ప్రకటించిన దాని ప్రకారం చైనాలో యూనియన్లు పెరిగాయి. సమ్మెలు, పని ఆపటలు, నెమ్మదిగా పని నిర్వహించటం (Go slow), నిర్వాహకుల కార్మికుల మధ్య ఘర్షణలు పెరిగాయి. ఒక్క 1988 లో తొలి ఆరునెలల్లో చైనా ప్రకటించిన సమ్మెలే 49. దాచిపెట్టినవి మరెన్నో!

బోనస్సులకూ ఘర్షణ తప్పటం లేదు. హాంగ్‌ఝున్‌లో బట్టల మిల్లులో స్త్రీ కార్మికులు బోనస్‌కే సమ్మె చేశారు. షాంఘైలో అదే కథ.

1982 లో కార్మికులకు సమ్మె హక్కును తీసేస్తూ రాజ్యాంగ సవరణ చేసింది చైనా. కానీ కార్మికులు సమ్మెలు చేస్తూనే వున్నారు. గొప్ప కమ్యూనిస్టు దేశం, కార్మిక నియంతృత్వం కోసం విప్లవం తెచ్చిన చైనా, కార్మికులకు సమ్మె హక్కు కూడా లేకుండా చేయటం కమ్యూనిస్టు నేతలు అధికారంలో కొచ్చాక ప్రవర్తించే తీరును తెల్పుతుంది.

"కార్మికుల స్థితిగతులు అతిఘోరం" అంటాడు షెన్‌ఝున్ యూనియన్ సభ్యుడు. "హక్కులేని బ్రతుకులు. వైద్య సదుపాయాలు గానీ సామాజిక ప్రయోజనాలు గానీ లేక, ఏ చట్టం పట్టించుకోక అధిక సమయం (Over time) బలవంతంగా పని చేయిస్తారు" అంటాడతను.

'కొన్ని కర్మాగారాల్లో కార్మికులు దినానికి 6 నుంచి 8 గంటలు నియమిత సమయాన్ని దాటి అధిక సమయం పనిచెయ్యాల్సి వస్తుంది. నెలకొక్క రోజే విశ్రాంతి. అధిక పనివల్ల నిస్త్రాణ వచ్చి కొందరు స్పృహ తప్పిపడిపోయిన సంఘటనలున్నాయి. మిషన్లల్లో ప్రమాదాలు చెప్పలేనన్ని'.

మేనేజిమెంటు వారు (కమ్యూనిస్టు కార్యకర్తలే!) కార్మికులకు లెట్రిన్లకెళ్ళే సమయం కూడా 8 నిమిషాలవరకే పరిమితం చేశారట! ఓ ఫోర్మెన్‌ను తనిఖీకి పెట్టారట!!

"మాచేత బలవంతంగా 13 గంటలు పనిచేయిస్తారు దినానికి అధిక వేతనం అన్నది ఇప్పటికివ్వలేదు. పనిచేసే సమయంలో మమ్మల్ని నీళ్ళు కూడా తాగనివ్వరు. బయటకెళ్ళేప్పుడు ఒళ్ళాంతా తడిమి వెదుకుతారు. మేము నివసించే ఇళ్ళు ఘోరం. అవి 20-30 మందిని కుదించి పడేసే పశువులశాలల్లాంటి ఇనప రేకుల గోదాములు. స్నానాల గదిగాని, లెట్రిన్ గాని వుండనేవుండదు" అంటూ వాపోయింది ఓ స్త్రీ కార్మికురాలు.

కామ్రేడ్ల ప్రపంచంలో ఇష్టం వున్నా లేకున్నా స్త్రీలు కూడా కార్మికులే.

## ప్రజాస్వామ్యం కావాలి :

కమ్యూనిజం తెచ్చిన విప్లవపు తొలి రోజుల్లో కమ్యూనిస్టు నేతలు కామ్రేడ్లు. ప్రజానీకంతో కలిసి తిరిగారు, తిన్నారు, చేదోడు వాదోడుగా మెలిగారు. అధికారంలో కొచ్చాక పాత వర్గాల్ని తుడిచేసి సోషలిజం తెస్తామన్నారు. తీరా గద్దెలెక్కాక పాత వర్గాల్ని తుడిచారేగాని కొత్త వర్గాల్ని తెచ్చారు. మామూలు జనం పశువుల్లా కనిపించారేమో. స్వతంత్ర

జీవనంలేదు, సంసారాలులేవు, పిల్లల మీద ప్రేమలేదు, ఇంట్లో నాలుగు వస్తువులు సమకూర్చుకునే అవకాశం, ఆశలు లేవు. ఇవన్నీ కాపిటలిస్టు కంపులు అన్నారు. కమ్యూనిస్టు పేరుతో జనానికి బందిలిదొడ్లను ప్రసాదించారు.

స్వేచ్ఛగా మాట్లాడాలని, స్వతంత్రంగా జీవించాలని అలమటించి పోయింది చైనా ప్రజ.

పెరిగే అశాంతికి పతాకస్థాయి జూన్, 1989లో బైజింగులోని టియానన్‌మెన్ కూడలిలో జరిగిన ప్రదర్శన. ఫలితంగా పిన్న వయసు వారని కూడా ఆలోచించక టాంకులతో కాల్చి పారెయ్యటం జరిగింది. ఇది ఒక్క కమ్యూనిస్టు పాలకులకే సాధ్యమేమో!

ప్రజా విముక్త సైన్యమే (PLA) ప్రజావాహిని రక్తాన్ని ప్రవహింపజేసింది.

'తుపాకి గొట్టంలో నుంచే అధికారం పుడుతుంది' అన్న మావో సూక్తిని మరోసారి అమలు పరిచి తమ గద్దెల్ని పదిల పరుచుకున్నారు. పార్టీ ఛైయిర్మెన్ డెంగ్, ప్రధాని లీపింగ్‌లు. విద్యార్థుల పట్ల సానుభూతి చూపిన ఝావో ఝియాంగ్ అన్ని అధికారాల్ని కోల్పోయి దాదాపు బందీగా బ్రతుకుతున్నాడు.

ఇటీవల 1989, డిశంబరు డెంగ్ పదవీ విరమణ చేసినా మరింత కరకు కమ్యూనిస్టు నేతలు అధికారాల్ని హస్తగతం చేసుకున్నారు.

విద్యార్థి నేతలు, మేధావులు విదేశాలకు పారిపోయ్యారు. 'బయట నుంచే పోరాటాన్ని సాగిస్తాం' అన్నారు షాంగ్‌లీఝి, లూగ్జియావో లాంటి విద్యావేత్తలు.

కానీ చైనా ప్రజల ఆశలు అడుగంటుతున్నాయి. ప్రజాస్వామ్యం మృగతృష్ణ అవుతోంది. స్వేచ్ఛ కోరిన గొంతుకలు మూతపడ్డాయి.

కమ్యూనిజం విఫలంకాగా రష్యా తన ధోరణిని మార్చుకుంటోంది. రష్యా కబంధ హస్తాల్లో దశాబ్దాలుగా క్రమ్గిపోయిన బాల్టిక్ రాజ్యాలు, తూర్పు ఐరోపా దేశాలు కమ్యూనిజాన్ని వదిలించుకుంటున్నాయి. చైనా మాత్రం ఇంకా ప్రజల్ని కమ్యూనిజం పేరిట, సోషలిజం పేరిట బానిసలుగా నొక్కి పెడుతోంది.

ప్రజలు తమకేది హితమైనదో స్పష్టంగా గ్రహించగలరు. తమకు పనికిరాని, ఇష్టంలేని కమ్యూనిజాన్ని చైనా ప్రజలే స్వయంగా వదిలించుకునే రోజులు ఎంతోదూరం లేవు.

నాలుగు అంతస్థుల ఎత్తువున్న మావో ప్రతిమను బైజింగు విశ్వవిద్యాలయం లైబ్రరీ నుంచి పగలగొట్టి తీసేస్తే డెంగ్ ఊరుకున్నాడు. పెద్దపెద్ద లైట్ల వెలుతురులో కార్మికులు పగలగొట్టటం వేలాది మంది ఆనందంగా చూచారు.

"బావుంది. ప్రజల మనస్సుల్లో ఓ ఫ్యూడల్ బరువు దిగిపోయింది అన్నారో ప్రొఫెసర్."

చైనా భవిష్యత్తు కిదో నాందీ ప్రస్తావన.



# నవభారతి మీకందించిన పుస్తకరత్నాలు



| | | రూ॥లు |
|---|---|---|
| 1. | స్వాతంత్ర్య వీరసావర్కార్ | 8-00 |
| 2. | చదువుల చెట్టు | 10-00 |
| 3. | భారతీయకరణ | 10-00 |
| 4. | మనదృక్కోణం | 10-00 |
| 5. | భీష్మయుధిష్ఠిర సంవాదం | 10-00 |
| 6. | హిందూ విజయ దుందుభి | 12-00 |
| 7. | ఉజ్జయినీ పతనం | 13-00 |
| 8. | మార్క్సిజమా? మానవతా వాదమా? | 13-00 |
| 6 | వందేమాతరం | 13-00 |
| 10. | ఇస్లాం సామ్రాజ్యవాదం | 15-00 |
| 11. | కర్మయోగి దీనదయాళ్ ఉపాధ్యాయ | 15-00 |
| 12. | మహారాణా బాప్పా | 16-00 |
| 13. | ఉత్తిష్ఠత! జాగ్రత! | 16-00 |
| 14. | హైద్రాబాద్ అజ్ఞాత చరిత్రపుటలు | 16-00 |
| 15. | సామ్రాట్ పుష్యమిత్ర | 17-00 |
| 16. | స్వాతంత్ర్య సమరజ్వాలలు | 20-00 |
| 17. | చంద్రశేఖర ఆజాద్ | 20-00 |
| 18. | 1857 స్వరాజ్య సంగ్రామం | 20-00 |
| 19. | తెగని సంకెళ్ళు | 20-00 |
| 20. | అల్లూరి సీతారామరాజు | 22-00 |
| 21. | కాళరాత్రి | 30-00 |
| 22. | జై సోమనాథ్ | 30-00 |
| 23. | యుగద్రష్ట డా॥ హెడ్గేవార్ | 60-00 |
| 24. | పాంచజన్యం | 60-00 |
| 35. | End of A Scleutific utopia | 80-00 |
| 26. | Our Tomorrow | 95-00 |

చదవండి !                                                    చదివించండి !!

* 'సెక్యులరిజం' అంటే నాస్తికవాదమా? మత రహిత రాజ్యమా? లేక హిందూ వ్యతిరేకతే సెక్యులరిజమా?

* ఢిల్లీకి సమీపంలో ఉన్న లాహోరు విడిపోగా, ఎన్నో వందల మైళ్ళ దూరం ఉన్న, ప్రాంతాలు ఎలా కలిసి ఉన్నాయి?

* జమ్మూలో వేర్పాటు ఉద్యమాలు లేవు. కాశ్మీర్ లోయలో వేర్పాటు ఉద్యమాలు తీవ్రంగా జరుగుతున్నాయి. ఎందువల్ల?

* తూర్పు పంజాబ్‌లోకి, పాకిస్తాన్ నుండి వచ్చిన హిందూ శరణార్థులు ఓటర్లు అయినారు. జమ్మూలోకి వచ్చిన 80,000 హిందూ శరణార్థులకు, 42 సం॥ల అయినా ఓటు హక్కు ఇవ్వబడలేదు. ఎందుచేత?

మొదలగు వివరాలకై చదవండి

శ్రీ మన్నవ గిరిధరరావు గారి రచన

# వెర్రితలలు వేస్తున్న సెక్యులరిజం

వెల : 2.50